


# దురాచారఫలితము

కాలక్రమమందు సంఘమునందు అనేక దురాచార సంఘటనలు పుట్టుచుండును. అట్టివి జరిగిన వెంటనే, సంఘసంస్కర్తల తీవ్రవిమర్శనల కవి గురియైన, లోకము కన్నెత్తి వాని నప్పుడు కనుగొనును. అట్టి సంఘటనలు తిరిగి జరుగకుండ చూడవలెనను యోచన మాత్రమంతట కలుగుచుండును.

కాని యిట్టి దురాచార సంఘటనలు జరుగుచుండుట, సంఘమునకు నివ్వెరపాటు కలుగుచుండుట, రెండును పుట్టుచు, కాల ప్రవాహమున కొట్టుకొనిపోవుచునే యున్నవి.

కాని యివి యోచనమాత్రపు కార్యములు గావు. దీక్షవహించి, దినదినము యిట్టి సమస్యల నెదుర్కొనుచు, చిరకాలము పాటు పడినగాని నెరవేరని కార్యము లివి.

ఇట్టి దురాచారములు, సంఘపతన హేతువులనియు, అవి నీతిదాయకములనియు, పాప భూయిష్టములనియు, ఇంతవర కెన్నియోసారులు ఈ 'గృహలక్ష్మి'ద్వారా లోకమునకు చాటియున్నాము. అనేకసారు లిందలి యనర్థములను పేర్కొనుచు, నివి సంఘోన్నతికి వేరుపురుగులనియు, వీనిని కూలంకషముగా నాశనము చేయనిచో, మనజాతికి మోక్షము లేదని ఎన్నియో నుదాహరణలతో నిరూపించి మనవి చేసియున్నాము.

ఈ విషయము లిపుడు క్రొత్తగా పేర్కొనుట చర్విత చర్వణమే యగును. కాని, లోకమందిప్పటికిని అచ్చటచ్చట పశుతుల్యములగు నిట్టి దురాచార సంఘటనలు జరుగుచుండుటవలన తిరిగి వ్రాసి, హెచ్చరింపవలసి

వచ్చినది. చూడుడు! గడచిన జూలై మాస మందు మైసూరు సంస్థానములో నొకవృద్ధ వివాహము ఎంత హృదయ విదారకముగా నంతమైనదో!!

మునియప్ప యనువతనికి రేబదియేండ్లు వయస్సు. అతనికి మొదటిభార్యవలన నేకు గురు సంతానము. గార్హస్థ్య జీవనమునందు ముప్పాతికవంతు తీరినను అతనికి తిరిగి వివాహము చేసికొన ముచ్చట గల్గినది. నారాయణమ్మ యను నొక పదునేడేండ్ల యువతిని వివాహమాడినాడు. ఆమె యిష్టము నకు వ్యతిరేకముగా నామెతలిదండ్రు లాత నికి కట్టబెట్టిరి. రానురాను భార్యాభర్తల మధ్య నశాంతిప్రబలినది. అసంతృప్తి హెచ్చి నిత్యము వాదోపవాదములను, యీర్ష్యయు, అసౌఖ్యము వారిరువురిమధ్య పెచ్చు పెరి గినది. అతనికి ఆమెయన్న ననుమానముచే సర్వదా నామెను తిట్టుచుండెడివాడు. అందు వల్ల నామె యొకనాడు భర్త నిదురించుచుండ, నొకపెద్దబండరాయి యాలిని తలపై విసరి యాతని చంపినది. ఈ దాంపత్యజీవనము నాల్గుమాసములు మాత్రమే నడచినది. కేసుయొక్క యితరవిషయము లేమైన నేమి, వ్రాసికూ్యమను తరవు సాక్ష్యమిది. అందుకు ఆమె యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధింపబడినది......

హత్య గావించినవారికి ఉరిశిక్షయో, ద్వీపాంతరవాసశిక్షయో విధించుట న్యాయ శాస్త్ర దృష్టిలో ధర్మమే గావచ్చును. కాని, న్యాయమూర్తులు యీ కేసులో తీర్పు చెప్పుచూ, "ఒకవృద్ధునికి అన్నము పున్నము నెరుగని యొకకన్యను బలవంత ముగా వివాహముచేయుట చాలా విచార మగు సంగతి. కేసు వివరములను బట్టి యీ యువతికి భర్తయందు 'అసహ్యము' పుట్టి, తన సంసార జీవితముమీద 'విరక్తి' కలిగియుండవచ్చును..." అన్న విషయ ములు గమనింప దగినవి.

భర్త వృద్ధుడు, భార్య యవ్వనవతిగల సంసారమందు శాంతి మృగ్యముగాదా?

ఏండ్లు మళ్లిన యాతని శరీరతత్వము వేరు. యావ్వనవతియగు నీమె శరీరతత్వము వేరు. అట్లనే మానసికసంబంధమైన రుచులు గూడ. అన్నియు ననుభవించి, ధనార్జన, పిల్లల పురోభివృద్ధి, దైవభక్తి మొదలు గాగల విషయములనుగురించి యోచింపుచు, విశ్రాంతి తీసికొనవలసిన కాలమాతనిది. ప్రాపంచిక సౌఖ్యములన్నియు, నొక్కటొక టిగా యనుభవించుచు, తనసౌఖ్యము, తన యందము, తనప్రత్యేకత, మొదలైన దినదినము పెరుగు నవీన భావములకు ఆశ పడే కాలమీమెది. ఇవి ప్రకృతి సహజ మైన మానవ చేష్టలు. ఇందొకరి కొకరికి ఎంతమాత్రము జత కుదురదు. శారీర మాన సిక ప్రవృత్తులందు పూర్తి వ్యతిరేకమైన యిట్టి దాంపత్యమందు ఒకరిని చూచిన యొకరికెట్లు పొత్తు కుదురును? ఆమె శృంగా రము చూచి యిత డనుమానపడి యామెను నిందించును. ఆమెకది భరింప శక్యముకాక యాతని నీసడించును. అందువల్ల ఆమెకు

తిట్లు, కొట్లు నిరాదరణ అతనివల్ల; అతనికి, ఈర్ష్య అసభ్యత, అసౌఖ్యము ఆమెవల్ల. నిత్యము జరుగుచుండు ఇట్టిది నిష్ఫలకణము వలె యిద్దరి హృదయములందు చేరి, దిన దిన ప్రవర్ధమానమై, చివరకు నిద్దరి ని దహించివేయక మానదు. ఇట్టి అశాంతికి పుట్టినిల్లైన యీ సంసారము, అవినీతికి దారి తీసి, సంఘౌన్నత్యమును కూలద్రోసి, జాతి వినాశమునకు హేతువై, సభ్యతా ప్రపంచ మందు చోటులేకుండ జేయును......

వృద్ధుడైన భర్తతో గూడిన సంసార సౌఖ్యము, ఆపైన యేడుగురు సవతి పిల్ల లలో నొక పిల్లగా యుండవలసిన తాను- తన యీడుగల నా ఏడుగురు సవతి పిల్ల లకు మాతృ స్థానము వహించి, మాతృ ధర్మములను నిర్వహింపవలయును ..ఇట్టి నిత్యకంటక పంజరమైన సంసారము యమ లోకమే. ఇట్టి దాంపత్య జీవనము నాల్గు మాసములు కాదుగదా, నాల్గు రోజులై నను నాల్గు యుగములన్న మాట. ఇట్టి రోజొక యుగముగా గడపు జీవనము జీవి తాంతము వరకు గడపవలెనన్న హృదయము గల ఏమానవుడైనను చంచలింపక మానడు.

ఇట్టి సమయములలో ఎంత ఓర్పు, శాంతి గల వారికైననూ న్యాయా న్యాయ విచ క్షణ యుండదు; ముందు వెనుక లాలో చించు జ్ఞాన మగుపడదు; ధర్మాధర్మ నియ మములు కానరావు. మనసులోని యాలో చనకు, చెప్పెడి మాటకు, చేసెడి చేతకు లంకెయుండదు. తన జీవితపు 'సౌఖ్యము' అను ప్రశ్నలో కొట్టుకొనుచున్న ఒక వ్యక్తి, ఆ ఆవేశములో ఏపని చేసిననూ చేయును...

ఇట్టి కేసులు మనమెన్ని చూచుటలేదు? 'చంపవలెనను నిచ్ఛలేదు... ఒడ వెరుగని యీ వేశములో యుక్తా యుక్త జ్ఞానహీన మగు చేష్ట ..' అని తీసి పారవేసి, కొద్ది సంవత్సరముల కారాగార శిక్షలతో పోయిన కేసులెన్ని లేవు? ఇది పురుషులలోనే చాల నెక్కువ. పురుషుడైన, కొద్దిపాటి కారాగార శిక్షతోడనే పోయెడివి. కాని ఇది స్త్రీకి సంబంధించినది. ఆమె అ స హా య. ఈ యన్యాయము పురుషునిపట్ల జరిగిన 'ఔ' నను వారుండరు. 'స్త్రీ' గనక తప్పదేమో!

ఇట్టి మనోవైకల్యమును గుర్తించియే, న్యాయమూర్తులామెకు ఉరిశిక్షకు బదులు, ద్వీపాంతరవాస శిక్షనిచ్చి కొంత కనికరము చూపియున్నారు.

ఆమె స్థితిగతుల నన్నింటిని అర్థముచేసి కొని, తీర్పులో నట్లు చెప్పిన న్యాయమూ ర్తులు, యీమె కొసంగబడిన శిక్షనింకనూ తగ్గింపవలసినది. కాని యట్లు చేయలేదు— కేసుయొక్క యితర వివరములు తెలియవు గానమనమేమి యనుకొనుటకును వీలులేదు.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ! నీవు వ్రాసిన లేఖ అందినది. అవును నీవు వ్రాసినట్లు యిపుడు మన దేశమున ప్రతి పట్టణమునందును 'లేడీస్ రిక్రియేషన్ క్లబ్బు'లను ఆంగ్ల నామధేయముతో మహిళాసంఘములు స్థాపింపబడుచున్న మాట వాస్తవము. కాని యివి చేయుచున్న పనినిగూర్చి యోచించినచో వీని వ్యాప్తికి హర్షింపవలయునో మరి ఏమి చేయవలయునో విదితముగాకున్నది.

ఈ క్లబ్బులయందు సంపన్నులైన వారు ముఖ్యముగా ఉన్నతోద్యోగుల భార్యలును గొప్పగొప్ప న్యాయవాదుల భార్యలును జమీందారిణులును అధికముగా చేరుచున్నారు. వీరిలో మోటార్కారులు, రత్నాభరణములు, నవనాగరికపు వేషభాషలు కలవారికిందు పలుకుబడి అధికముగానున్నది. పేదలకు సరేసరి; మధ్య తరగతి వారికిగూడ యిందు స్థానములేదు. ఒకవేళ స్థానము లభించినను ఆదరములేదు. కాన సామాన్యులెవరు గాని యిందుచేరుట కుత్సాహపడుట లేదు. వారు చేరలేదను విచారము క్లబ్బు స్థాపకులకుగూడ లేదు. వారి లక్ష్యమెంత వఱకును సమానహోదా వారితోడి పొత్తునే కోరుచున్నది. హోదాలోనేగాక వేషభాషలలోగూడ వారికి ప్రత్యేక పరిశీలనగలదు ప్రాచీనమగు కట్టుబొట్టుల నభిమానించువారుగాని మాతృభాషా మాత్ర పరిచయులైనవారుగాని (ఏ గొప్పఆఫీసరు భార్యయో అయినదప్ప) వీరికి నచ్చుటలేదు. అవకతవక లెన్నియున్నను యింగ్లీషు ముక్కలు రెండు వచ్చియున్నచో వారిని పెద్దజేసి వారి చుట్టును మూగిపోవుట లేడీసుక్లబ్బులలో నొక ముఖ్య ఆచారమై పోయినది. పోనిమ్ము వారికిష్టమైన వారినే వారి సంఘములో చేర్చుకొందురు. కొంగు తగిలిన కొంత వాసియని వారి వస్త్రాభరణముల వైభవము చూచుటకు మధ్య తరగతి వారక్కడకుపోక పోయిన వారికిగాని వీరికిగాని లోపములేదు. ఆచేరిన గొప్పవారైన దేశకాలపరిస్థితుల నెఱిగి విద్యాభివృద్ధికిని సంఘౌన్నత్యమునకును కృషిచేయుచు ఐకమత్యముతో మెలగుచున్న వారి కృషికి సంతోషింపవచ్చును. కాని ఏ క్లబ్బులో చూచినను ఆటలుపాటలు అల్పాహారపు విందులు తప్ప మఱియే యభివృద్ధి యత్నములును గానరావు సరిగదా వీనిలో చీట్లపేకవంటి వ్యసనపుక్రీడల నాడుట గూడ పరిపాటిగానున్నదనుచో నీక్లబ్బులెంత విపరీత పరిస్థితులలో నడుపబడుచున్నదియు విదితము కాగలదు.

భారతమహిళా లోకమెంతయో అధఃపతితమైయున్నది. ఈనారీ ప్రపంచము నుద్ధరించుటకై మహిళాసంఘము లెన్నియైన నెంతయైన పాటుబడవలసియున్నది. స్త్రీలలోనే చిన్నసంఘము స్థాపింపబడినను దాని లక్ష్యమిదియై యుండవలయునుగాని క్రీడా

వినోదములై యుండరాదు. అందును నీ సంఘములలో కలిమిలేముల తారతమ్యములు, ఉద్యోగ అనుద్యోగ తారతమ్యములు, ఉత్తమాధమకుల తారతమ్యములు పాటింపబడునేని యివి సంఘమునకు వేఱుపురుపులుగా పరిణమించునేగాని సంఘోపకరమైనవిగా విరాజిల్లజాలవు.

సంఘముయొక్క లక్ష్య మెప్పుడును ఉదారమైనదిగా నుండవలయును. అందురెల్లరు ఉత్సాహముతో జేరి దాని ప్రయోజనమును కొల్లగా అనుభవించుట కవకాశముండవలయును. పెద్దలు పిన్నల నాదరించవలయును. శ్రీమంతులు సామాన్యుల దరిజేర్చవలయును. ఉన్నతోద్యోగుల భార్యలు అనుద్యోగుల పత్నుల సాహచర్య మభిలషింపవలయును. ఉన్నత కులజులు నిమ్న కులజులతో స్నేహము సలుపవలయును. ఒక మతమువారు వేఱొకమతమువారితో పొత్తు కలుపవలయును. వీరెల్లరు నేకమై తమ ప్రధాన లక్ష్యమైన మహిళాభ్యుదయమును సాధింప తలపెట్టవలయును. ఈ విధమైన లక్ష్యము కలిగియుండిననే స్త్రీల సంఘములు ఉన్నతికి రాగలవు. 'అయితే నీవేది మోసాద చెప్పుచున్నావు. మేమిట్టి ప్రయోజనముల కొఱకు మాక్లబ్బును పెట్టలేదు. వినోదము కొఱకు ఉల్లాసముకొఱకు పెట్టుకొన్నాము. ఇంట్లో పనిచేయుటకు నౌకరులున్నారు. గనుక దేహపరిశ్రమకొఱకు మేమిచట బంతి ఆటలాడుచున్నాము. ఉల్లాస ముకొఱకు టీపార్టీలు చేసుకొనుచున్నాము. ఉబుసుపోకకు చీట్లాడుచున్నాము' అని వారనవచ్చును. నిజమే భోగలాలసులగువారు తమ ఉల్లాసముకొఱ కెన్ని దూబరాకర్చులు చేయుటలేదు. అట్టి వానిలో నిదియునొకటి యని సమాధానము చెప్పుకొనుట యుక్తముగానేయున్నది. కాని యేస్త్రీలైతే తాము గొప్పవారమని భావించుచున్నారో నిజముగా ఆగొప్పతనము వారిదిగాదు సూర్యుని కాంతులు చంద్రునకు వెలుగు నిచ్చినట్లుగా మనిషియొక్క రూపవైభవము దర్పణములో ప్రతిబింబించినట్లుగా భర్తలవల్ల వీరికీ గొప్ప సిద్ధించుచున్నది. ఇది స్వయంకృషిచేనుపలబ్ధమైనది కాకపోవుటవలన వీనికి నిత్యత లేదు. కాన స్త్రీలు నిత్యమైన అధికృత సంపాదించుకొనవలయునన్నచో నీ క్రీడా వినోదముల ప్రాముఖ్యత తగ్గించి సంఘాభ్యుదయమునకు సేవచేయవలయును.

కల్పలతా! స్త్రీలలో విద్యాభివృద్ధిలేదు. సంఘసంస్కరణాభిలాష లేదు. ఆర్థిక సౌకర్యములేదు. కళాసక్తిలేదు. పరిశ్రమాభిరతి లేదు. స్వదేశ స్వభాషాభిమానములేదు. పరిస్థితులిటులున్నను మనమెట్లు అభివృద్ధి పొందగలమను ఆవేదనయే స్త్రీలలో కానరాదు. చుక్కానిలేని నోడవలె స్త్రీలు మెటుగాలి వీచిన నటుకొట్టుకొనిపోవుచున్నారు. కొందఱు భక్త్యాడంబరముతో భజనకూటముల దెసకు కొట్టుకొనిపోవుచున్నారు. కొందఱు క్రీడాసక్తులై క్లబ్బులలో చేరుచున్నారు. కొందఱు మోక్షాపేక్షతో గురుశుశ్రూషా పరతంత్రులగుచున్నారు. మఱికొందఱు దేశ

సేవాభిలాషులై జాతీయోద్యమలోని కాకర్షింపబడుచున్నారు. వేనికిని రాగల స్వాతంత్ర్యములేనివారు రొంపిలో దిగబడిన వేగల వలె సంసారకూపములోబడి భర్తల దార్జన్యమునకు అత్తల ఆరడులకును గుఱియై గాసిల్లుచున్నారు. స్త్రీలకు ద్రవ్యవసతియే స్వల్పము. ద్రవ్యమున్నను దానిని వెచ్చించు నధికారము శూన్యము. ఇట్టిసందర్భములో ద్రవ్యముగలవారును, దానిని వెచ్చింపగల నధికారము గలవారును వినోదసంఘముల వ్యామోహములలో పడి, క్రీడావిలాసములకొఱకు తమ ద్రవ్యమును దుర్వ్యయముచేయుచో నిట్టి సంఘములవలన నారీలోకమునకు నష్టమేగాని ప్రయోజనములేదని చెప్పవచ్చును.

మిత్రమా! ఈ క్లబ్బులపై నొకప్పుడు సదభిప్రాయము నాకును ఉండెను. ఈక్లబ్బుల స్థాపించువారు ఇంచుక జాతీయాభిమానము గలవారై సంఘోద్ధరణాభిలాషగల వారగుచో ద్రవ్యవసతిగలవారు గనుక వీరు నారీలోకోద్ధరణకెంత కృషిచేయగలరని భావించియుంటిని. కాని రానురాను వీనిలో వినోదక్రీడలే ప్రాముఖ్యత గాంచుటయు, భాగ్యాధికారము గణ్యతహెచ్చి తదితరులు నీరస భావముతో జూడబడుటయు, విదేశవేష భాషల వ్యామోహములు హెచ్చువిూరుటయు జూడ వీనిప్రయోజనము శూన్యమను నభిప్రాయము గలుగుచున్నది. నేనే గాదు సుప్రసిద్ధ నారీశిరోమణియగు శ్రీమతి సరోజినీనాయుడుగారు 4-12-38 తేదీని విజయనగరము లేడీసు రిక్రియేషను క్లబ్బువారొసంగిన సన్మానపత్రికకు ప్రత్యుత్తరమొసంగుచుచో నేమని చెప్పిరో కనుము.

"స్త్రీ లింతమంది చేరుటయు నీక్లబ్బును నిర్వహించుటయు సంతోషమే. కాని, ఒక విషయము: ఏదో క్లబ్బుకు వచ్చితిమి, బంతియాటలాడితిమి, కారమ్సు ఆడితిమి చీట్లాటలాడితిమి, తిరిగి యింటికి పోతిమనుటలో ప్రయోజనములేదు. నిరక్షరాస్యులగు స్త్రీ సభ్యులనుజేర్చి వారికి జ్ఞానోదయము గావించినయెడల వారి తరతరములవారకు ప్రకృతి గావించిన వారగుదురు. విూ ఆటపాటలైన పిమ్మట కుట్టుపని వడుకు మొదలైన పరిశ్రమలందు కృషిసల్పిన పరిశ్రమాభివద్ధికి తోడ్పడినవారయ్యెదరు." ఈవిధముగా వితంతువులనుద్ధరించుటనుగూర్చియు, ప్రథచికిత్సలను గుఱించియు, స్వదేశీనిగుఱించియు శ్రీమతి సరోజినీదేవిగారు చెప్పినారు. నిరంతరము దేశసేవాపరాయణయగు నీ సరోజినీదేవి చేసిన హితోపదేశము క్లబ్బు స్థాపకులాంధ్రులు గుర్తించిననెంతయు మేలు చేకూరు ననుట నిక్కువము.

౧-౧-౩౯, ఇట్లు,

భావపురి శారద.

# మంచిమాటలు

విద్వాన్ కవితిలక, కవితావిశారద శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు

మాటఁబోలు మాట మాటకు మాటకు నెంచిచూడ భేదమెంతొ కలదు
మాటలందు మంచిమాటలు వేఱగు మంచిమాట లెఱిఁగి మహిమ గనుఁడు.
మనసులోనఁ గలదు మంచియుఁ జెడ్డయు మంచివానికెల్ల మంచియగును
చెడ్డవానికెల్ల చెడ్డగనే దోఁచు నెంచకుండు కంటె మంచిలేదు.
మంచి, చెట్టకన్న మంచిగఁ దోఁచును మంచి చెడ్డ, చెడ్డ మంచియగును
హితము మంచి, ప్రియమదెంచంగఁ జెడ్డయౌ, మంచివాఁడు హితము మఱుగువాఁడు.
మాట వెన్నఁబోలు మనసు పాషాణంబు మాట కత్తియైన మనసు వెన్న
మంచివార లట్లు వంచకులుందురు మంచినెఱుఁగు బుద్ధిమంతు డెవఁడొ.
ఎంత మెఱుపు పొంకమెంతయో ముసిడికి నాల్కమీఁదఁ బెట్టి నరకము గద
పైన మంచిజూపి భ్రమపెట్టు నెన్నియో మంచినెఱుఁగ వట్టిమాట కాదు.
సాధుబాధఁ జేయు శస్త్రంబు చెడ్డయౌ కంతిగోయునట్టి కత్తిమంచి
చేతలందు లేదు చెడ్డయు మంచియు చిత్తమందు కలదు చెడ్డ మంచి.
మెత్తనైన వెన్న మేలంద్రు మేకులు మెత్తనైనవాని (యువియు) మేలటంద్రె
బట్ట మెత్తనైన బండయు మెత్తనదైన మంచియగునె యరసిచూడ.
మంచిది భారతవర్షము, మంచివి గంగాదినదులు మలయాది గిరుల్
మంచిది వేదశాస్త్రము, మంచివి చౌషష్టి కళలు మన తత్త్వంబుల్.
మంచివారలు మనకవుల్ మనవి కావ్య నాటకాదులు మంచివి నాణెమైన
యాంధ్రగీర్వాణములు మంచివవనిలోన మనము మనజాతి తెలివియు మంచివంద్రు.
మంచిమంచి యన్న మాటలు మేలౌనె మంచిగుణము లలవరించుకొనక
ఎన్న నేటికురక ఏ నాటి మంచియౌ మంచి యెంతగలదు మనకు నేఁడు.
కళయొ, శిల్పమొ, కవితయో కార్యదీక్ష పూని తీక్షవేళల మానసమున
కందమానందమౌ నటు లభ్యసింప రాదె విద్యార్థు లూరక రచ్చలేల.
వట్టి దేశాభిమానముల్ గిట్టవెందు దేశవిద్యలు కళలు సందేహమెడలి
బుద్ధిమంతులు నేరిచి సిద్ధిగాంచి విత్తనము భూమిలో నిల్వఁ బెట్టవలయు.
నేర్వలేకయున్న నేర్చినవారల నెంచి గౌరవించు టెంతొ మంచి
మంచిమాట కన్న మంచి నీరస్నంబు కలుగఁజేసి వారి నిలుప మంచి.
బ్రదుకనిచ్చి వారి పాండిత్యమును శిష్యకోటికొసఁగు వీలు కూర్చి చేర్చి
పెద్దసభలలోన విద్దెలు నేర్చిన వారిపూజ సేయవలయు నేఁడు.
ఆంగ్లవిద్య నేర్చి యాంగ్లరాజన్యులఁ గొలిచి మెట్టి ఘనత గొనిన యేని
తెలుగు సంస్కృతంబు కలనైన మరువక మహిమగాంచు టెంతొ మంచిమాట.

చందాదారులకు! గ్రంథాలయాలకు!!

# స్త్రీ సంస్థలకు

** సంక్రాంతి కానుక **

# గృహలక్ష్మి

ప్రథమ తొమ్మిది సంపుటాలు

జనవరి అంతంలోవచ్చే ఆర్డర్లకు

ఒక్కొక్కటి ఒక్క రూపాయకే

ఇవ్వబడును!

ఈ అపూర్వతరుణమును అందరూ ఉపయోగించుకొన

గోరుచున్నాము.

గృహలక్ష్మి కార్యాలయం,

రాయపేట, మద్రాసు.

# దేశ పర్యటనము—లోకజ్ఞానము

శ్రీమతి కె. సుగుణమణిగారు

నవంబరు 'గృహలక్ష్మి' సంచికయందు ఒక విలేఖరులు మళయాళ దేశమును గాంచివచ్చి పాఠక లోకమునకు తమ అనుభవములను దెల్పియుండిరి. దేశ పర్యటన జ్ఞానార్జన కుపకరించునని యెందరెందరో స్త్రీ పురుషులు దెల్పుచునే యున్నను మనతోబాటు, మన పత్రికలును, విద్యాపీఠములును ఆమాటయే తల పెట్టకున్నవి. లండను నగరమునుండి కొందరు విద్యార్థులు హిందూదేశమునకు కేవలము 'జ్ఞానార్జన' నిమిత్తమై వచ్చుటకని యిటీవల అచ్చటి విద్యాసంస్థలు యేర్పాట్లు గావించినవట; ఉత్తర హిందూస్థానమున గూడ విద్యార్థులకు విజ్ఞానమును గూర్పవలె నని వివిధరాష్ట్రీయులు జూపుటకై ప్రత్యేకరైలు సౌకర్యములు గావింపబడినవట. భావి పౌరులు గాబోవు యువతీయువకులకే గాక వారికి విద్యాబుద్ధులు గరపు పెద్దలకును గురువులకునుగూడ యీమాదిరి జ్ఞానము కొంత ఆవశ్యకము. "జ్ఞాన" మన భిన్న భిన్నాభిప్రాయములుండవచ్చును; కాని, దేశాటన వలన 'లోకజ్ఞానము' విస్తారము అలవడగలదనుట నిస్సంశయము. వివిధ హేతుజాలములవలన కూపస్థ మండూకములై యున్న స్త్రీలకిది ముఖ్యావసరము. దేశకాల పరిస్థితుల నెఱింగికొనుట కిది పత్రికల పఠనము కంటెను, కళాశాలల చదువులకంటెను యెక్కువ సహకారియగుననుట నిర్వివాదాంశము. జ్ఞానార్జనకై యుండిన మార్గములలో నిదియొక యుత్తమమార్గమే. కాని, కొంత వ్యయప్రయాసలచే గూడికొనియుండుటచే ప్రస్తుతము మనకిది దుర్లభమైయున్నది.

దేశ పర్యటన మన ఖండాంతరములు జూచి రావలె నని గాదు. ఖండాంతర పర్యటన, యేస్వల్ప సంఖ్యాకులకో గాని గలుగదు. అందును స్త్రీలకు-సామాన్య గృహిణులకు-యిట్టిది దుర్లభమే యనవలెను. ఖండాంతరపర్యటన, యావద్భారతదేశ పర్యటన అట్లుంచి, రాష్ట్రాంతర పర్యటనమైనను స్త్రీ లోకమునకు సిద్ధించినచో నది గొప్పవిషయమే! సామాన్య స్త్రీజనానికది చాలవచ్చును. కొంత విశాల పరిజ్ఞానసేకరణకు, తన వ్యక్తిధర్మ నిర్వహణకు, బిడ్డల శిక్షణకు యిది చాల వరకు సహకారి కాగలదని చెప్పవచ్చును. ఎంత విద్యావతులైనను దేశమునుగూర్చి కొంత నెఱింగి కొననిదే విశాల దృక్పథము అలవడదు. వారి ఉపన్యాసములందును, రచనలయందును అంత సమగ్ర దృష్టి దోచదు.

ఈ దేశపర్యటన బాల్యమునచేగాక-భూగోళము, దేశచరిత్ర, మానవసంఘము, లోకజీవనము యిత్యాది విషయములగూర్చి కొంత అవగాహనమైన వెనుకనే-విద్యపరిపూర్తియైన వెనుక నే-జేయుట చాల యుక్తము. విద్యపరిపూర్తియైన విశ్వవిద్యాలయమున పట్టభద్రులైనంతనే విద్యపరిపూర్తియైనదని చెప్పుట చాల పొరపాటు; వారికి లోకజ్ఞానమంతగ నుండదు. ఈ విషయమై ముందుముందు మనవిజేసెదను.

సాధారణముగ మనకు-యేదూరపు బంధువుల యింటికో (పరామర్శకు)గాని, యేదగ్గరి పుణ్యక్షేత్రములకో (పుణ్యార్జనకు)గాని జేయు యాత్రలు దప్ప-అంతగ దేశమును జూచు భాగ్యముండదు; అభిలాషయు నుండదు. అభిలాషయున్నయెడల ధనముండదు; అది యున్నచో యే నూతనాభరణసేకరణకో గాని జ్ఞాన సేకరణకు వినియోగింపబడదు! ఈవిధముగనైనను కొంత దేశ పర్యటన జరుగునని ప్రపంచ జ్ఞానము లబ్బునని పెద్దలీ యాత్రావిధానములను గల్పించి యుండురు. దేశ పర్యటనవలన-వివిధ రాష్ట్రాంతములు,

2

సంస్థానములు, అందలి పంటలు, పరిశ్రమలు, ప్రజల ఆచారములు, వారి ఆర్థిక, సాంఘిక, నైతిక, రాజకీయ స్థితిగతులు, ఆరోగ్యము, విద్యావిధానము మున్నగు విషయముల గూర్చియేగాక అందలి నైసర్గిక రమణీయములు, ప్రకృతివిచిత్రములు, పూర్వీకుల లలితకళా శిల్పకళాచిహ్నములు, ఆధునికుల నాగరికతా పరిస్థితులు, ఆడివారల ఆశాకాంక్షములనుగూర్చి ముఖాముఖి సతింగికొనుటకును వాటిని స్థిరముగ జ్ఞప్తియందుంచుకొనుటకును వీలున్నది. వాటినిగూర్చి (హిస్టరీ జాగ్రఫీ) పుస్తకములలో నెంత చదివినను ప్రత్యక్షముగ జూచినంతటి బాగుగ నవి హృదయమున బట్టవు.

పుణ్యక్షేత్రముల పట్టణములు "జూచిరావలె"నని గాక—ముఖ్యముగ లోక జ్ఞాన సంగ్రహణార్థమై మేము యీమధ్య మళయాళ దేశముతో బాటు, దక్షిణ దేశమంతయు జూచివచ్చితిమి. 'మేము'అన నెవరో రామేశ్వరయాత్రకు బయలుదేరిన పెద్దజట్టుఅని అనుకొనగలరు! మైసూరు, కొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానములతో బాటు—హిందూదేశము ఆసేతు హిమాచల పర్యంతముగాదు గాని,—ఆసేతు వింధ్య పర్యంతరముజుట్టి రాగలభాగ్యము నాకు గలిగినది. చూచిన వింతలతోబాటు వీలైనంతవరకు స్త్రీల పద్ధతులు, విద్యలు, సంస్థలు మున్నగు విశేషములుగూడ సేకరింపుచు విపులవిషయ సంగ్రహణమే చేసితినని చెప్పవచ్చును. ఈమాదిరి పర్యటన జ్ఞానార్జనమున కెంతవరకు సహకారియైనదో దెల్పుట వ్రాయుట కష్టమే.

మనలో పల్లెవారకు ముఖ్యముగ స్త్రీలోకమునకు యితరప్రదేశములగూర్చి మూఢవిశ్వాసములు, విచిత్రాభిప్రాయము లెన్నియోయుండును. "లంకలో రావణుని కాష్టమింకను మండుచుండునట, నిజమేనా?" యని మేము తిరిగివచ్చినవెనుక మాయూరనే యొక గృహిణి ప్రశ్నించినది! ఆడు మళయాళమట; మళయాళమంత్రములట; జనవశీకరణతంత్రములట !! ఇట్టి పిచ్చియూహాలు పోగొట్టుటకై స్త్రీల యేకైక పత్రికయగు గృహలక్ష్మి యత్నించునని తలంప వచ్చును.

దేశపర్యటన గావించిన వారికి కళాశాలల విద్యార్థులకంటెను,పత్రికల పఠకుల కంటెను విశేష లోకానుభవ ముండుననుటకు చిన్న యుదాహరణ.

రామేశ్వరమున మేముండిన బసలో దేశద్రిమ్మరియైన యొక వితంతువుతో సంభాషించుట తటస్థించినది. ఆయమ ఆంగ్లవిద్యగూడ కొంత అభ్యసించినదే గాని ధోరణినిబట్టి జూడ అంతవిస్తార పరిజ్ఞాన మామెకు యెట్లలవడినదా యని మేము ఆశ్చర్యచకితుల మైతిమి. ఆమె మాటలు కొన్ని యిచట దెల్పుట సమంజసము. అందలి విషయములు 'కాద'నుటకు మా కియువురకును చేతగాకపోయినది. "ఏమి చదువులో నండీ యిప్పటి చదువులుచదివిన విద్యార్థులకంటె మా బోంట్లకే యెక్కువ లోకజ్ఞానమున్నదని నాయూహ. ఏవంటరో తెలిసికొని ఏపిల్లలకో ట్యూషనుచెప్పి జీవయాత్రగడుపు సమర్థులైనను మావిధవలకు అలవడినది. మాపినతండ్రికొడుకు ఒకాతడు ఉన్నదంతయు తెచ్చించి బి.యే. వరకు చదివెనుగాని, యిప్పటిదాతనికి కుటుంబపోషణ యట్లుండి-తనదారాపుత్రుల పోషణయైనను చేసికొనగలిగిన లోకజ్ఞాన మలవడలేదు. ట్యూషను చెప్పుకొన్నను వంశపారంపర్యావచ్చిన పౌరోహిత్యమును చేసికొనినను అతనిగాడి మర్యాదకు లోపమట; పరభాగ్యోపజీవియై అత్తింటకాపురమున్నదో గౌరవభంగము కాదట. 'విద్యయొసగును వినయంబు' అని పెద్దలనియుండిరే గాని యే కోశమునను అది గాన్పించదు. అతడే గాదు, మా మేనత్తకూతురునకును ఆ నిష్ప్రయోజకవిద్యయే చెప్పించిరి. వారి వేషములకూ మన సాంప్రదాయములపై వారికున్న యూహాలకూ, దేశవిషయములలో వారికిగల జ్ఞానశూన్యతకు వారి ననవలసిన పనిలేదు. ఇప్పటి విద్యావిధాన మా రీతి

నున్నది. మన విద్యాలయములలో—మనదేశమున నేమున్నదో, పరిస్థితు లెట్లున్నవో యెరుఁగ జెప్పరు గాని విదేశములు కంఠస్థ మొనరింపజేతురు. అనాది నుండి గౌరవనీయమైన గంగానది యెచ్చటనున్నదో వారికి దెలియదుగాని అమెరికాలోని అమెజాన్ నదినిగూర్చి బాగుగ దెలియును. మన దేశమునను్న హిమాలయపర్వతముల మహిమ దెలియదుగాని యెచ్చటనోయున్న హేమిల్టన్ పర్వతముల తత్వము బాగుగ దెలియును. మన 'పాలిబిడ్డ' పాదాగుర్ద యెట్లు చేయునో దెలియజెప్పరుగాని, జర్మనీలో జార్జెట్లు జేయు జంత్రములగూర్చి చదివింతురు. మాట మాట్లాడిన మాం చెప్పరు జ్ఞప్తికి వచ్చునుగాని. మాధవుని బాల్యక్రీడ స్థానమగు మధుర మాట దలపెట్టరు. ఓంద్రపెట్టుట కారంభించిన సాత్త్వగర్జ నుద్దియే గాని ఆంధ్రవీరుల పుట్టినిల్లగు రాయలగల్లు మాట యెత్తరు. చింపన్న దొరగారు వ్రాసిన హిందూదేశ చరిత్ర గరుపుదురుగాని, సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్ర జూడనీయరు. తామ్సన్ వ్రాసిన గ్రంథము వారికి త్రికాలపఠనమున కనువగుచున్నది గాని తిక్కన సోమయాజి వ్రాసినది త్రిప్పిరైన జూడరు. కల్లకల్పితకథలు చదివినట్లు మొల్లరామాయణము చదువనీరరు. మిల్టన్ వ్రాసిన పద్యములకు వ్యాఖ్యానము జేయగలరు గాని చిలకమర్తివారి చిన్న పద్యమునైనను విప్పి చెప్పలేరు. గోల్డుస్మిత్తుగారి 'డిజెర్టెడ్ విలేజి' కాస్వాదమంజెదరు గాని ఉన్నవ వారి 'మాలపల్లి' నాహ్వానింపరు. షేక్స్పియర్ గద్యరచన కానందించెదరుగాని పోతనకవి పద్యరచన మాధుర్యమునైనను జవిజూడ నేరరు. బైబిలు ముందు భగవద్గీత తలపునకైనరాదు! సీజరుముందు శివాజీ తలపునకైన రాకుండబోయెను గదా! చాంబర్లేను చాతుర్యముముందు జవహారిలాల్ జమేయున్నట్లు దోచదు. మేక్డొనాల్డుగారి మజాకా యెఱుంగుదురు గాని మహాత్ముని మహిమను గ్రహింపరుగదా!

“విద్యార్థులను దానిలోబడి నిరాడంబర స్వదేశ వస్తువులు మాని, ఆడంబర విదేశవస్తువులకై కొట్టుకొందురు. ఆడంబరజీవనమున నిక ఉత్కృష్ట భావోదయమగునా? దేశౌన్నత్యమును గాపాడుటకు (అటువంటి) విద్యార్థులను, మీబోటి విద్యాధికులను (అని మమ్ముగూడ జట్టుకట్టినది!) యత్నింపకున్నచో నాబోటివారలా జేయునది?”.........చివర కామె “ఇటువంటి చదువులు చదివి పాసయే బి. ఏ.లకంటె కాశీ రామేశ్వర యాత్రలు జేసివచ్చిన మాబోటి బి. ఏ. (బోడి అక్క)లకే కొంత లోకజ్ఞానమున్నదని మిన్న నొక 'పెద్దమనిషి' నేను రైలులో యెదిరియా మాట్లాడుచుండ బల్కి దిగిపోయెను. లేనిచో నతనిచే 'యిూ' ననిపించియుండును” అని జెప్పదొడగెను. అదృష్టవశాత్తు మేము బి.ఏ.లము గాకపోతిమి! బి.ఏ.ల మనుకొనియే మావద్ద ఆవిడ యీరీతిని మొదలిడినదేమో చెప్పలేము!! నిజముగ కేవలము దేశాటనవలన నింత సామర్థ్యము గల్గియుండునా యనుకొని అంతటితో ప్రసంగమును మార్చివైచితిమి..........“'శీర్ణమస్తే సుభాషితం' అన్నట్లు యిట్టివారల యూహ లెన్నెన్ని మన బోంట్లకు పత్రికల మూలముననైనను తెలియరాకుండ బోవుచున్నవో గదా!” యని యవ్వల మాలోమే మనుకొంటిమి.

మరి మూడు విషయములు దెలియబరచి యిప్పటికిక జాలింతును.

(1) తిరువాన్కూరు సంస్థానములో అస్పృశ్యతా నివారణకై దేవాలయములలో హరిజనప్రవేశము గల్పించిరని పాఠకు లెరిగియేయుందురు. అచట నొక హరిజన ఉపాధ్యాయునితో బ్రసంగించితిని. ఆతని యూహ లివి:—“అన్నాతురునకు అంబసేవ యన్నట్లు ఆర్థికదుస్థితిలో జిక్కికొనిన మాకీ దేవాలయప్రవేశము గల్పించిన మహారాజునకును, మహాత్మునకును మేము కృతజ్ఞులమే! దానివలన ఉత్తమ

నీచకులములకే మానసికపీడ కొంత తొలగినదిగాని అంతకంటె విశేషలాభము మాకు గలుగలేదు. దేవాలయప్రవేశములకంటె దుస్సహదారిద్ర్యనివారణకు దోహదము గల్పించుట ప్రప్రథమమని లోకము గమనించినచో యెక్కువగ యుద్ధరింపబడియుందుము."

(2) ఇక మైసూరు 'రామరాజ్య'మని, యీతిబాధలులేక సుభిక్షమైయున్నదని పలువురు విశ్వసించునట్లు చెప్పబడుచున్నది. మైసూరు, బెంగుళూరు మున్నగు పట్టణప్రాంతములు గావించినచో యిట్టి యూహాలలో నంతగ యదార్థమున్నట్లు గానరాదు. మన ఆంధ్రరాష్ట్రమున కొన్నిచోట్ల నాట్యమాడు దరిద్రదేవత అచ్చటను తాండవమాడుచున్నది. ధనికుల యార్భాటములో నది గానరాకున్నది. కష్టించి పండించిపోయు కృషికుడే యెల్లెడల యీ లేమికి విస్తారముగ గురియైయుండుట జూడ మన సాంఘిక కట్టడపు పునాదు లెంత దిట్టముగనున్నవో మననునకు దట్టకమానదు. గాంధిజీ కోర్కొనిన 'రామరాజ్యము' మనకు యీ కలియుగమున కలలోనివార్తయే యై పోవునా? యని ఆశయు నిరాశయు గలుగకమానవు.

(3) మలబారు యువతులు ఆంధ్రయువతులకంటె యందకత్తెలని సోదరు లనియుండిరి. 'అంద' మనిన వ్యక్తినిబట్టి మారుచుండును; గాని ఒక్కటి మాత్రము చెప్ప సాహసింపవచ్చును. ఆంధ్రరమణీమణులు యే రాష్ట్రియువతులకును యేవిషయమునను దీసిపోరని మాత్రము చెప్పవగును; కాని వారి విద్యావిధానములు, సాంఘికపద్ధతులు, మానసికప్రవృత్తులు యింకను యెంతయో అభివృద్ధినందవలసియున్నవి. దేశభాషలపై యభిమానములు మనకు ఉగ్గుపాలతో గల్గినవేయైనను—విశాలపరిజ్ఞానము లేనిచో యవి సంకుచిత రాష్ట్రాభిమానములుగ స్వజాతి, స్వలాభపరాయణగ పరిణమించగలవు. దీనికి ప్రతిక్రియ—విద్యాభివృద్ధి. స్త్రీ విద్యాభివృద్ధి, సేవాపరాయణ, సహనము, త్యాగము, దేశకాలపరిస్థితుల అవగాహనా సామర్థ్యము, నిజధర్మ నిర్వహణభాగము. ముందు వీటన్నిటికి మూలసూత్రము ఎరిగిన విషయములను వారివారి సామర్థ్యములనుబట్టి ఆచరణలో బెట్టవలెనన్న యత్నము.

మన విద్యాభివృద్ధికని యిట్టి పత్రికలు ప్రయత్నించుచునేయున్నవి; తెలియని విషయముల నెన్నియో తెలియజేయుచునేయున్నవి; ఆంధ్రరచయిత్రీమణు లెందరో వీటిద్వారా మనలను ప్రబోధించుచునే యున్నారు. గాన—

"యెఱుకగలవారి చరితలు
గరచుచు సజ్జనుల గోష్ఠి గదలక, ధర్మం
బెఱుగుచు యెఱిగినదానిని
మనువ కనిష్ఠించునది సమంజసబుద్ధిన్."

అన్న అమృతపల్కులు సోదరీమణులకు జ్ఞప్తికి దెచ్చుచుంటిని.

## ఆహ్వానము

నవ్యసాహిత్యాన్నిగురించీ, ఆధునిక గ్రంథాలనుగురించీ,
భాషనుగురించీ చక్కని విమర్శనలతో వచ్చే సోదరీమణుల
వ్యాసాలకు.

# శీలము

వి. వి. రామకృష్ణారావుగారు

యువతులు జన్మతగాత్రములను ప్రావీణ్యము సంపాదించుటకు దినములు వత్సరములు లెక్కసేయక కాలమును వెచ్చింతురు. యువకులు వృత్తి నైపుణ్య సంపాదనకో, యుద్యోగార్థమో సంవత్సరముల పర్యంతము పనిచేయుచు తిరుగుచు కష్టపడెదరు. చిత్రకళోపాసి, యొక్క చిత్రమును నేత్రానందకరముగ చిత్రించి తన జీవితమును ధన్యమొనరించుకొనుట కర్థజీవితమును చిత్ర రచనాభిజ్ఞతకు ధారవోయును. కవి యొక్క గ్రంథమును రచించుటకై బుఱ్ఱ కొట్టుకొనుచు మెదకు చించికొనుచు వత్సరములనిట్టె దాటించుచుండును. కాని పై జెప్పినవారు సౌశీల్య సంపాదనార్థ మొక్కనిముసమైన బాటుపడరనుట వాస్తవము. అట్లన్నంతనే వారిలో సుశీలురు లేరనికాదు. ఇది లోకసంగ్రహముగ చెప్పినమాట మాత్రమే. పైవారే కాదు, సామాన్యముగ నేరును బ్రయత్నమునలుపరు. సౌశీల్యసంపాదనమన సామాన్యవిషయమా? దానివలన మనకెట్టి చిత్తశాంతి, ఎంత స్వార్థవిముఖత, ఎట్టి సుఖసంపద లభించును! కాని యిట్టిదానిని ద్రోసి రాజని యెంతసేపును వేలకై, లక్షలకై చేతులు సాపుచు పుంటిపై సీగలవలె వర్తించుట శోచనీయము. ధనమంత యశాశ్వతమగునదెద్దియు లేదు—సౌశీల్యమువలె స్థిరముగనిలుచునదియును లేదు. ధన సంపాదనమున బడి జీవనమును వ్యర్థమొనర్చు వారు కొంతకాలమైనను పొందైన, చక్కని, తుష్టినొసగు, శీలమును సంపాదించు బ్రయత్నమునందు సద్వినియోగము చేయురు. కష్ట సుఖములయం దెకబాయక నండనిల్చు సౌశీల్యమునందువారి కావిముఖత యేలనో?

మనలో ననేకులలో మఱియొక లోపమున్నది. సాధారణముగ వారు మంచిగుణములే ప్రయత్నముచు నల్పకనే దమక మరవలయునని యాశించుచుందురు. అందులకై వఃకిమాలిన నటనలనుసలిపి సజ్జనులలో నగుబాటునకు పాలగుదురు. అందని మ్రాని పండ్లఱులు సాదిన వచ్చునా, వృక్షము నధిరోహించిన వచ్చునా? మనలో సద్వంశజులకు నదుపాయములు సమృద్ధిగనున్నవారికి నది సాధ్యమగుగాని సామాన్యులమాట సందేహమే! జతనము సలుపక యే సామాన్యులకు—సౌశీల్యమే కాదు—ఏదియైనను నబ్బుటగాని లభించుట కాని వట్టిమాటయే! ప్రపంచమందలి యన్ని జాతుల యాచారాది విశేషములను సమగ్రముగ నెఱిగిన హెర్బర్టుస్పెన్సరుగారు కూడ నిట్లు వాక్రుచ్చి యున్నారు. "మనమెన్ని పాటుల బడినను యెట్టి మంత్రతంత్ర విశేషముల

ఈ వ్యాసమునకు వలయు విషయము ప్రపంచవిఖ్యాతుడగు Marden Orison Swett యొక్క Every Man a King నుండి గ్రహింపబడినది.

సాయమునకై నను బంగారమువంటి నడవడిని సీసమువంటి శీలమువలన నొందజాలము. కాని శీలమునకు మార్పును దెచ్చుట మనకు సాధ్యమే. శీలమును మంచిమార్గమున నడపినచో నడవడియు నామార్గమునే ద్రొక్కును. కాన చక్కని శీలమే సరియగు త్రోవ."* వీనియందలి యదార్థము నెవరు కాదనగలరు?

'పూవై వంగనిది మ్రానై వంగునా' యనుదాని నెల్లరు నీసందర్భమున జ్ఞప్తియందుంచుకొనవలయును. మొక్క లేతగనున్నప్పుడే మనమే వైపునకు వంచిన నా వైపునకు తిరుగును. కాని మ్రానైన పిమ్మట దానిని వంచనే సాధ్యపడదు. చిన్ననాడు చక్కగ పెరుగునట్లు చేసినమొక్క మ్రానైనప్పుడెట్టి శోభతో విరాజిల్లును! ఇదియొక గొప్పప్రకృతివిశేషమును మానవులకు గోచరింప జేయుచున్నది. దీనిని చూచి మానవులు తమ శీలమును శిక్షించుకొనరాదా? మాతకు శిశుహృదయ జ్ఞానమున్నచో శిశువును శత్రువులతో సమానమై దాని భావిజీవితమును దుఃఖభాజనముగ చేసివైచు భయభావము, విచారభావము, పెంకెతనము, వీటి కన్నింటికంటె ప్రమాదకరమగు నవినీతి మొదలగు నెన్నింటినుండియో రక్షించిపోచుట యెంత సులభము?

నేటికిని తల్లిదండ్రులు తమ సుతులను ఏదో వారియందలి లోపమునెన్నుచు మంచివాడవుగమ్మని ప్రబోధింతురు. కాని వారు సంపాదించవలయునని తామాసించు వానినెన్నడును విప్పిచెప్పరు. దినమున కెన్నియో మారులీ బోధ జరుగుచునే యుండును. ఇది 'పుణ్యమునకుబోవ పాప మెదురయ్యె నన్నట్లు' కీడుగనే పరిణమించును. అప్రయోజకుడా యని తన్ను పలుమారు దండ్రి నిందించుచుండ దనయునకు గ్రమముగ మనసు వికలమై యేమో! మనమా జన్మాంతము నిట్లు అప్రయోజకులని పిలువబడవలసినదేనా యనియు చివఱకు మనము అప్రయోజకులమేమో! యనువఱకు వచ్చి యాస్థితికి వచ్చుచుందురు; శాశ్వతముగ నప్రయోజకులగుదురు. ఇక ప్రయోజకులమగుట మనకు సాధ్యముకాదని, యేమియు ప్రయత్నించకయే, వారనుకొనుచుందురు. ఈవిధమున తల్లిదండ్రులు తనయులను దిద్దజూచుట చాల తప్పు; మిగుల హాస్యాస్పదము. ఇట్టి హితబోధనకును అపజయమును గూర్చియే యోచించుచు (దానికొరకే పని చేయుచున్నట్లు) జయము నొందగోరుటకు నేమంత భేదమున్నది? గోళ్ళను గిల్లుకొనుచున్నట్లు శీలమునందలి లోపములనే యెన్నుచు కూర్చుండిన నికవారి శీలమందవి చిరస్థాయిగ ముద్రితములై వారినిక విడువవనుటలో నెంతమాత్రమును విశేషములేదు. దుర్గుణములనుగూర్చి యోచించుచుండ నిక మంచియందు తలపే యుండదు. రోగవిశేషములనుగూర్చి యనవరతము చింతనముసేయు వైద్యవిద్యార్థుల కారోగముల చిహ్నములు కలుగుచుండునట! రోగములే ఒకప్పుడు కలుగునట! పై పరిణామమున

* Herbert Spencer, Famous Writer On Sociology.

కును దీనికిని ఏమియు భేదములేదు. సద్గుణములనుగూర్చి యోచించుచో నవియే మనకు పట్టువడి క్రమముగ మనకు స్తోత్ర పాత్రమగు శీల మలవడును. పైఁ జెప్పిన యంశములకై యొక కథనిట యుదాహరించుట మంచిదని తలతును. ఒకప్పు డొక సర్వసంగ పరిత్యాగియగు సన్యాసి యుండెనట. ఆతఁ డొక వేశ్యా సదనమున కెదురుగ గూర్చొని (యా వేశ్య వ్యభిచార జీవనమునకు వ్యసనపడుచు) దాని యింటికి బోవుచు వచ్చెడి విటుల సంఖ్యను లెక్కింపసాగెనట. ఇట్లు మరణాంతము వఱకు లెక్కించుచునే యుండెనట. అతఁడు చనిపోయిన పిమ్మట యమభటు లాతని బట్టి యంతకాలయమున కీడ్చి తీసికొనిపోవుచుండ దారిలో విష్ణులోకమున వ్యభిచారకళంకిత జీవియగు పూర్వ పరిచితయగు వేశ్య స్వర్గసుఖముల ననుభవించుచుండ గాంచి వేదననొంది యమకింకరుల నిదేమి యన్యాయమని యేడ్చుచు నడుగ వా'రోరీ పాపాత్మా! పాపమది యేహ్యవర్తనంబున కళంకితమైనను చిత్తమునందు జొనుపక నంతతము హరిభక్తియందు తన్మయురాలై యుండ, నీవు బూడిద బూసికొని భక్తుడనని పేరు పెట్టికొని విటులను లెక్కించుచు వేశ్యమీదను, వ్యభిచారము మీదను మాత్రము దృష్టి నిలిపితివిగాని సన్యాసి కర్హ జీవనమగు భక్తి వైరాగ్యములను చూడవైతివి. కాన నీకిదే తగినఫలము పదపద' మనుచు వానిని నరకయాతనల ననుభవింప జేయుటకై నెట్టికొని పోయిరట. చూచితిరా యోచన ప్రభావము!

చిన్ననాడే, బాలురకు పద ప్రయోగమునందు భద్రముగ వర్తిపవలయుననియు బదములకు ప్రాణమున్నదనియు నవి వ్యర్థములు కావనియును బోధింపవలయును. ఇదియే బాలుర భావిజీవితములందు సుఖమునకుగాని దుఃఖమునకుగాని జయమునకుగాని యోటమికిగాని మూలములగును. బాలురకు సుఖశాంతి యుతములగు మనుజుల కథలగూర్చి బోధించుచు వారి మనసుల కవి యొక్కునట్లు చేయుచు దుఃఖభూయిష్ఠములైన కథలను తెలిపి వారికి చిత్తవైకల్యము కలిగించకుండుట మిక్కిలి సులభము, మిగుల లాభదాయకము, ముందు ముందు వారి జీవయాత్రకు మిగుల మేలు. మృదువైనవారి మనసులయం దేదివైచిన నది ముద్రితమగును. చెడుపనులగూర్చి బోధించుచు వారికి తప్పుదారులను జూపుట మంచిదా, సత్కథాకాలక్షేపమున వారి మానస క్షేత్రములందు సౌశీల్య వృక్షమునకై దగిన విత్తులుచల్లుట క్షేమమా? నిర్ణయమునందే బాలుర సుఖ, దుఃఖాదుల మూల మిమిడియున్నది, దీని బాధ్యతగల తల్లిదండ్రులు చాల మెలకువగ నుండవలయును.

నేడు చాల దేశములందు (మనదేశమున మాత్రము తప్ప) పాఠశాలలయందు వారము వారమో మాసము మాసమో పిల్లలచే వీర రసోద్రేకపూరితములైనవో న్యాయ ప్రవర్తనతోకూడినవో నాటకములు బాలుర కట్టి గుణములను కలిగించుటకై ప్రదర్శింప

బడుచుండును. వీనియొక్క యవసరము మనదేశమునకు ముఖ్యముగ నాంధ్రులకు చాల యున్నది. దైవానుగ్రహమున నిట్టివి ప్రోత్సహింపబడుగాక! ఇట్టివే ముఖ్యముగా సౌశీల్య నిర్మాణమునం దెక్కువగా దోడ్పడుచుండును.

చెప్పవలసిన దేమన సౌశీల్య సంపాదనమునకై దగినట్టి ప్రయత్నములను యుక్త విధానమున చేసిన నది తప్పక లభించును, దేనినైనను ఆసించి ప్రయత్నించు వారలకు దైవ సాహాయ్యము లభించును. కాని ముడిచికొని కూర్చుండు వారల కేలబ్ధియు నుండదు. ఆస్థయుండిననో యెన్నెని సద్గుణము లలవడును. అది లేనివాని కెన్నడును సౌశీల్యలాభము కాజాలదు. కాని యెంతటి మందునకైనను బనియందాశక్తి బుట్టించుట సులభ సాధ్యము. యెంతటి సోమరియైనను తగిన శిక్షణముండిన కొలదికాలముననే బనిసేయుట యన్న పరమానంద మొందుట తటస్థించును. మాంద్యతకు కారణము మెదడునందలి యంగకములకు దగినపని నీయక పోవుటే. మనసునందు పనిచేయుదమను నాశ జనించిన మెదడు ప్రోత్సహింపబడి శరీరావయవముల కన్నింటికి పనియందాసక్తి కలుగుటకు వీలుకలుగును. సౌశీల్య సంపాదనావశ్యమునను నెల్లరకు నిట్టి పరిశ్రమ యావశ్యకమని వేఱె చెప్పవలయునా? కొందఱుండిన చోటుననే యుండి కూపస్థమండూకమునకువలె ననభిజ్ఞతకు బాల్పడుచున్నారు. అట్టి వారికి ప్రపంచజ్ఞానమే లేనిచో శీల సంపాదనమెట్లు? కాన వారికితర ప్రదేశములందు పనిగల్పించి ప్రోత్సాహమొసగుట యావశ్యకము.

ఉత్తమ శీలమును బాలురకు కలిగించవలయుననేని తల్లిదండ్రులు కొన్ని ముఖ్యమగు విధులను గమనించిన శ్రేయస్కరము. బాలురకు సదాచార బుద్ధియందభిరుచి కలుగజేయవలయును; అవినీతికి ప్రోత్సహించు ఆలోచనలకు పనులకు నవకాశము నొసంగరాదు. దైహిక మానసిక నైతిక పరిస్థితులు మంచివగునో కాదో గమనించియుండు బాలురను పెంచుచు వారికి సౌశీల్యమలవడజేయు, పురాణగాథలను దెలుపుచు సద్బోధనల నొనర్చుచు నీతులను వెల్లడించుచుండవలయును. పిల్లలకు సద్భావములు కలుగునట్లు చేయవలయును. కష్టములందు సహనము, పట్టుదల, ధైర్యము కలిగి వాటి నెదుర్కొనజాలునట్లు చేయవలయును. చక్కని ప్రపంచ జ్ఞానమలవడ జేయవలయును. పని చేయునపుడు సమయోచిత బుద్ధిని కలిగించవలయును. నీతికిని యవినీతికిని పరిణామమునగల విస్తారమగు భేదమును బాలుర మనసులయందు బాగుగ నాటవలయును. బాలురకు తమయెడల నితరుల యెడల దేవునియెడల తమకుగల బాధ్యతను తెలియజేయవలయును. ఈ విధములను గమనించుచు బోవుచు పాపపుటూహల కెన్నడు మనసున నెడమీయక యాశాపూరిత దృక్కులతో తేజోవంతములగు మానసములతో పరిశుద్ధ హృదయములతో ఉన్నతాదర్శములతో ప్రయత్నించిన మనకుత్తమశీల సంపాదమొక కష్టమా?

# వెధవ ఘోషా

శ్రీ యస్. యమ్. అక్బర్ గారు

'అది ఒక్కటే చాలనాను మనవాళ్లకి. నోరుతెరిస్తే ఖురాను. నిజంగా పావనఖురాన్‌నే పాటిస్తే యావజ్జగత్తూ 'ఇస్లాం' మయమై ఉండవలసిందే. అపార్థాలు కల్పించి అప్రతిమాన దైవవాక్కును సంశయాపాత్రము చేస్తున్నారు. శాస్త్రవేత్తలు ఉన్నారు కాని సంఘశృంఖలములకు బద్ధులు. బురఖాను బూడిదగల్పిన తురుష్క ప్రజాస్వామ్య సృష్టికర్త కెమాల్ పాషా 'ఖురాను' చదువలేదా. అతడు ఖురాన్ నిబంధనలను ఈవిషయంలో ఉల్లంఘించుటలేదనే నాయూహ.'

బీబీతో సహా ప్రయాణం కడదామనుకున్నా. పదిహేను దినములు సెలవుకూడా పొందాను ఆఫీసులో. ప్రయాణం రెండురోజులే ఉంది. అలంకారాలన్నీ సిద్ధపర్చుకుంటున్నాం. పొరుగూరికి కదిలేసేగా పోకడలుమారాల్సింది.

నేను ఆధునికపద్ధతులపై నడిచే యువకుణ్ణి. మా బీబీకూడా యించుమించు అంతే ఒక్క ఘోషాతప్ప! సరే మానాన్న ఓ చిన్న 'గాంధీవాలా.' కాని ఘోషావిషయంలో మాత్రం సంఘానికి ఝడిసిపోయాడు. ఘోషానెపంతో సంఘం వెలివేస్తే తిండికీ గుడ్డకూ లోటుండదు. కథకూ, కార్యానికీ ఖర్చు తగ్గుతుంది! చస్తేమాత్రం 'చచ్చరి'వాళ్లు పూడ్చవలసొస్తుందేమో అనేదే భయం!

మా బీబీ మూడేళ్లక్రితం గరల్సు హైస్కూల్లో మూడో 'ఫారం' 'ప్యాస్' అయ్యింది. తెనుగ్గూడా చాలా యుక్తంగా మాట్లాడుకుంది. తాను మూడవ ఫారం ఫ్యాసయినా 'ముచ్చిక ముమ్మా'టంటూ మూడు సంవత్సరాలూ చదివి మూడో 'లిస్టు'లో S. S. L. C. ప్యాసయిన నన్ను బోల్తా కొట్టించడానికే ప్రయత్నిస్తుంటుంది.

బీబీని పిలిచి యిలా అన్నాను: "బీబీ కనీసం రైలెక్కిందగ్గర్నుంచీ పర్దా (ముసుగు) విసర్జించాలి."

బీ:—ఏం రైల్లోమాత్రం మగాళ్లుండరా?

నే:—ఉంటే ఉంటారు. రైలుపెట్టిదగ్గర్నుంచి 'శ్త్రిన్'వరకూ చేయాలేమిటి ఈ పర్దాప్రదర్శనం.

బీ:—సరే, మొదలెట్టండి పర్దాప్రతికూలప్రచారం. ప్రవక్త మొహమ్మదువారిచే సహితం ప్రబోధింపబడి పెద్దలచే అనుకరింపబడిన 'బురఖా' (మేలిముసుగు) 'తప్పు' అన్నమాట మీకు?

నే:—'తప్పు' అని ఎన్నడూ అనను. పెద్దల నియామకం మంచిదే! కుమార్తెను తండ్రి, తల్లిని కుమారుడు, తోబుట్టువు అన్నదమ్ముడూ, ఒకరేమిటి ప్రతిమానవుడూ యుక్తాయుక్త వివక్షణలేక పశుతుల్యంగా, పరమ అసహ్యంగా, రాక్షసాధముల్లాగు బలవంతంగా పాతివ్రత్యాన్ని, సచ్ఛీలాన్ని, సౌకుమార్యాన్నీ ఒగ్గిగట్టే రోజుల్లో, ఆ ఏడవశతాబ్దంలో ఆ అరేబియాదేశంలో ప్రవక్త మొహమ్మదువారిచే 'ఘోషా' ఉద్బోధింపబడ్డం సంఘశ్రేయోభిలాషచే! కాని యిప్పుడు ఈ హిందూదేశంలో ఈ ఇరువదవ శతాబ్దంలో యింకటి నవనాగరికతజ్యోతియొక్క కాంతిలో ఘోషాపిశాచనగ్న తాండవం దేనికి, భారతీయులు పశువులనుకున్నావా? గొఱ్ఱెలమంద లనుకున్నావా?

బీ:—మీ రేమన్నా అనండి. బురఖా ఉంటే

మగపిశాచాల దృగ్బాణాలు విరజిమ్మబడవు. నిరంతరం రకరకాల రంగురంగుల పురుషుల్ని చూడకపోవడంచేత స్త్రీయొక్క శీలం అంతత్వరగా వంచింపబడదు.

నే:—బురఖా ఉంటే నిశ్చలం, బురఖా లేకపోతే చంచలం అన్నమాట నీ ఉద్దేశములో స్త్రీశీలం. స్త్రీయొక్క శీలం ఏదన్నా ఒకరకమైన భాస్వరం అనుకున్నావా యేంటి? నీసాలో ఉంచితే భద్రముగా ఉండి వాయువులో ఉంచగానే కరిగిపోవడానికి? వెర్రివాగమ్మా—శీలానికి కంటిదృక్కుకు సంబంధం ఉండుగాక. బజారులవెంట స్వేచ్ఛగా తిరిగే స్త్రీలందరి శీలం సునాయాసంగా వంచింపవచ్చునన్న మాట? ముమ్మాటికి తప్పు. చూపులలో శీలం మారిపోతుందా? నిరంతరం మగాళ్లను చూస్తూంటే శీలం ఎంతమాత్రం మారదు సరిగదా రకరకాల రంగురంగుల పురుషుల క్రొత్త క్రొత్త పైశాచికప్రవర్తనలు చూస్తూంటే అసహ్యంకూడా వేస్తుంది. దృగ్బాణాల్తోనే శీలం మారిపోతుందనుకో. దారినిపోయే స్త్రీని ఎవ్వడూ చూట్టానికి ప్రయత్నించడు కాని బురకాలోఉన్న స్త్రీ అపరిచితము, నూత్నము కాబట్టి చూట్టానికి ప్రయత్నించి, సాధ్యమైతే ప్రయోగిస్తాడు దృగ్బాణాల్ని.

బీ:—సరే బురకా ఉంటే ఎంతో లేకపోయినా అంతే. ఘోషావల్ల వచ్చే లాభమూ లేదు. నష్టమూ లేదు. నేను బురఖా ఒక అలంకారంగా వాడతాను.

నే:—ఘోషాతో ఉంటే నష్టంలేదూ? హానియే ఉంది! దేవుడిచ్చిన గాలి, సూర్యరశ్మి లేక పాలిపోయి, తెల్లబడి, ఇంట్లోనేఉండి దుర్గంధవాయువునే పీలుస్తోంటే నానా జబ్బులకు గురికావలసివస్తుంది. 'ఫస్టుఫారం'లో నేర్చుకోలేదా. నీడలో పెరిగిన మొక్కకూ, ప్రకృతిలో పెరిగిన మొక్కకూ తారతమ్యం. అధోగతికీడ్చేది అలంకారమా?

బీ:—అయితే బురఖా పాటించేవారందరూ పామరులేనా? మీరేనా మహాపండితులు? ఈ పర్దా పాటించేవారిలో శారీర శాస్త్రవేత్తలు లేరా? ఉంటే తెలిసి ఊరుకున్నారా?

నే:—ముమ్మాటికీ పామరులే. నిరంతరం ఇళ్లల్లో కూర్చొని సూర్యరశ్మిని, మలయమారుతాన్ని, ప్రకృతి వీక్షణాన్ని పరాభూతమొనర్చమని స్త్రీల కుద్ఘాటించి తాము బజారులవెంట బయల్దేరడం పామరత్వం కాదూ? మహమ్మదు ప్రవక్తవారు పురుషునికంటె స్త్రీకే ఎక్కువ హక్కుల నిచ్చియున్నారే! మగవాళ్లను చూచి ఆడుది చపలఅవటం నిజమైతే సంఘానికి తలవంపు. స్త్రీనిచూచి పురుషుడు పశుతుల్యుడౌట మాత్రం నిజంకాదా. పశుతుల్యుడు సంఘానికి రాక్షసుడు కాడా.

బీ:—'ఖురాను'లో అట్లా వ్రాసుందిట.

నే:—అది ఒక్కటే చాలనాను మనవాళ్లకి నోరుతెరిస్తే ఖురాను. నిజంగా పావనఖురాన్ ని పాటిస్తే యావజ్జగత్తూ 'ఇస్లాం' మతమై ఉండవలసింది. అపార్థాలు కల్పించి అప్రతిమానమైన వాక్కును సంకయాపాత్రము చేస్తున్నారు. శారీర శాస్త్రవేత్తలు ఉన్నారు కాని సంఘశృంఖలములకు బద్ధులు. బురఖాను బూడిదగల్పిన తురుష్క ప్రజాస్వామ్య సృష్టికర్త కెమాల్ పాషా 'ఖురాను' చదువలేదా. అతను కురాన్ నిబంధనలను ఈవిషయంలో ఉల్లంఘించుట లేదనే నాయూహ.

బీ:—అయితే నేడు ధనవంతులు బురఖాను విసర్జించినా అంతగా అనేవారుండరు. మనలోటివాళ్లు సంఘానికి బలికావలసిందే.

నే:—అవును. ముమ్మాటికి ధనమే మతాన్ని మారుస్తోంది. అపార్థాలను వెదజల్లుతోంది. మతగురువులు ధనానికి దాసులు. భాగ్యవంతుడు ధనానికి యజమాని. అంచేత ధనవంతులజోలికి మతగురు

వులు అంతగా చొరకోనరు. నేడు మన భారతదేశంలో మహమ్మదీయు లెక్కడుమంది నిరుపేదలు కారా? పొలముల్లో, మిల్లుల్లో కూలినాలి చేసుకోవటం లేదా? వాళ్లకు బురఖాలు లేవే! వారి పాతివ్రత్యం, శీలం, మంటిలో కలుస్తుందా? బురఖాబూబుల శీలం ఘోషాపెట్టెల్లో భద్రంగా ఉంటుందా?! పిచ్చి చేష్టలు. తినడానికి అన్నంలేక ఇంటిలో మ్రగ్గుతూన్న జీవనోపాధిసాధనం నిరోధించుట ఘోషాయొక్క ముఖ్యోద్దేశమా! లేక పైత్యవికారమా?!

బీ:—(వేళగా) ప్రపంచంలో ఘోషా అక్కర లేదన్నమాట. అవుతే ఆరోజులొస్తే మానేస్తారులెండి అందరూను.

నే:—ఆరోజు మరెప్పుడొస్తుంది! మనం ఇంకా వెనుకటిపద్ధతులేన్న, వెనుకటి మతమాత్రలేన్న మ్రింగుతోంటే మరెప్పుడొస్తుంది. మన నడవడి వెనక్కే! మనంకూడా ప్రతివిషయంలోనూ వెనక్కే! నూత్న తేజాన్ని విరజిమ్మే స్వాతంత్ర్య జ్యోతిర్మయ కాంతుల్లో ముందుకు నెట్టుకొనిపోయే భారతీయోత్సాహాన్ని వెనక్కి దిగలీకదకు!! హృదయాల్లో ఊహాజ్వాలల్ని ఇముడ్చుకొని ఉబికిలే దిగమింగుతూ నోళ్లకు తాళాలు, చేతులకు సంకెళ్లూ వేసుకొని ఎందరు నారీరత్నములు మ్రగ్గుతూ గోడుగోడు మంటున్నారో ఈ ఘోషాగోడల్లో!!!

బీ:—సరే. బెజవాడ దాటితే తీసివేస్తాలెండి బురఖా.

నే:—ఉహుం. సరే 'గుడ్డిలో మెల్ల!'

౨

గోదావరిస్టేషను కల్లాం మధ్యాహ్నం బండికి. రెండు పెట్టెలు ఒక పెద్దబెడ్డింగు 'లగ్గేజి' చేయించి నేను కూర్చొన్న పెట్టెలో వేయించాను. బీబీ చేతికి టిఫిన్ కేరియరు ఇచ్చి ఆడాళ్ల పెట్టెలో కూర్చుండబెట్టాను. రైలు బోయ్‌మంటూ పొగలు గ్రక్కుతుంటూ 'బ్రిడ్జి' ఎక్కింది. బెజవాడలో 'గృహలక్ష్మి' గాని బీబీదగ్గరికి తీసుకెళ్లాను. బురఖా అలాగేవుంది. "ఇంకా తీయవేంటి 'బురకా'" అన్నా. "స్టేషను దాటితే" అంది నిమ్మళంగా బీబీ. వెళ్లి పెట్టెలో కూర్చున్నా.

జనం క్రిక్కిరిసి ఉన్నందున రైలు దిగనేలేదు. సరే. సెంట్రల్ స్టేషను వచ్చేసింది. రైలు ఆగి ఆగ డంతోటే కూలీలచేత సామాన్లు పట్టించుకున్నాను. బీబీకోసం ఆడాళ్ల పెట్టెవైపు వెళుతున్నాను. ఆపాద మస్తకంగా ఉన్న 'బురఖా'లో బీబీ ప్లాటుఫారం మీద నించుంది. స్టేషనునుంచి త్వరగా బయటపడా లని ఉంది నాకు. నా త్వరితాన్ని చూచి కాబోలు బీబీ నావైపే నడిచివస్తూంది. సరే. స్టేషనుబయట పడ్డాం. మా బీబీ 'ట్రేడ్ మార్కు' చూచి కాబోలు నేనో 'సాహెబ్ జీ' ననుకొని ఇద్దరు రిక్షావాళ్లు ఉర్దూలో బేరాలు చేయటం మొదలెట్టారు. ఆ రిక్షా వాళ్లు ఉర్దూలో మాట్లాడంచేత నాతో మాట్లా డ్డానికి సిగ్గుపడి కాబోలు ఊరుకుంది నా బీబీ. సిగ్గుపడేదాన్తో మాట్లాడ్డానికి నాకూ మనస్కరించక ఊరుకొన్నాను. రిక్షాలు వేగంగానడచి ఓ విశాల మైన మేడఎదుట నిలిచాయి. సామాను దించేశారు. ఇద్దరమూ దిగాము. బీబీ కొంచెము నావైపే వచ్చి ఆగి ఆకాశంవంక చూస్తోంది. రిక్షావాడు సత్రము గుమాస్తాను గాబోలు పిలిచాడు. రిక్షావాళ్లకు నిర్ణ యించుకొన్న రు. 1-8-0 ఇచ్చేసాను. "చాల కష్ట పడ్డాం బాబూ ఒక బేడ ఇప్పించండి" అన్నా డొకడు. పాపం! ఆ పాలిపోయిన ముఖాన్ని చూచి జాలివేసింది నాకు. నాదగ్గర చిల్లరలేదు. బీబీ కిచ్చిన అరరూపాయలో ఏమయినా మిగిల్నాయేమో నని "రెండణాలివ్వు" అన్నాను బీబీవైపు తిరిగి. నా నోటినుండి సగంమాట వెలువకముందే బీబీ ఉలిక్కిపడింది. ఆ విద్యుద్దీపకాంతులలో ఎదుట గోడలు కట్టినట్టుగాఉన్న దోమతెరగళ్లను చీల్చ

కోంటూవచ్చిన ఆమె నేత్రకిరణం నన్ను కబళించేట్టు కనిపించింది. ఆమె కళ్లల్లోకి చూస్తూ 'ఇవ్వు' అన్నాను. జవాబు రాలేదు. ఈ రెండణాలకోసము ఇంత దయగలమనిషి ఎందుకు ఇంత ఇలా పట్టు పట్టిందా అనుకున్నా. బేడ ఇవ్వడానికి బురఖా కాస్త తొలగించటానికి ఆ రిక్షావాళ్ల ఎదట సిగ్గు పడుతున్న దేమోనని 'Doesn't matter' (పరవా లేదు) అన్నా. అనీ అనడంతోటే బీబీ కాస్త వెనక్కి జరిగింది.

ఆమె తనకళ్లను దించివేసింది. కంటిరెప్పలను మూసేసి నావేపునుండి ముఖాన్ని త్రిప్పుకొని నిల్చింది. అంత సిగ్గుగలమనిషి ఈ నడిరోడ్డుమీద ఈ ఇద్దరు కూలీలెదట ఎందుకాలా కళాకోళం చేస్తుందా అని ఆశ్చర్యంవేసింది నాకు. సహజంగా పెంకిమనిషి గాదాయెను! ఆ మానముద్ర, ఆ కళాకోళం నా కేమాత్రం మనస్కరించలేదు. మమకారం అంతా పోయి మహాకోపంగా మారింది. ఈ వెధవబేడకోసం ఈ కూలీలెదట అర్థించడం నాక్కూడా సిగ్గేసింది. "Don't be silly" అన్నా సీరియస్‌గా నిమ్మళంగా.

'ససేమిరా' జవాబు శూన్యం. వినపడకపోవడానికి ఆపాదమస్తకంగా వేసుకొన్న ముసుగు అంత దళసరిగా లేదు. కాని నామాట బీబీ వినిపించుకోదు సరిగదా, నన్ను ఒక పరాయివాడిలాగ చూస్తో మరీ దూరంగా పోయినించుంది. మొహం అసలే చూపదు. ఎవరన్నా చూస్తే నన్నేమని భావిస్తారు చెప్పండి. పట్టి 'బ్రూటు' కాకపోతే భార్య ఇంతదూరం జరిగిపోయి నించుటుందా! ఇంత వివేకములేక పల్లెటూరి పశువులా బెదరిపోయి దూరదూరంగా నిర్లక్ష్యంగా నించోడం ఎంత శాంతుడికయినా కోపం తెప్పిస్తుంది? నా కరికాలుమంట నెత్తికెక్కింది. ఆ రిక్షావాళ్లు లేకపోతే దవడ 'సాఫు' చేద్దామనుకున్నా.

"నిన్నే" అన్నాను మహాకోపంతో. ఆ అపూర్వ నాట్యదృశ్యాన్ని చూచి కాబోలు అప్పుడే బయటకు వచ్చిన సత్రం గుమాస్తాగారూ, 'రిక్షావాలాలు' మొగాలు మొండిచేటల్లాగ చేసుకొని చూస్తున్నారు. జవాబుకోసరం బీబీకి దగ్గరగా వెళ్లాను. ఇంకా వెనక్కే నడుస్తుంది. ఈమాటు చిన్నమంటలేచి నా మనోవీథిని పొగక్రమ్మింది. పరిపరివిధాల ఆలోచిస్తున్నా. చుట్టూచూచా నొకమాటు. బీబీ చేతికిచ్చిన టిఫిను కేరియరు 'గైరుహాజ' రవడం గమనించా. 'ఇదా సంగ' తనుకుంటూ 'ముందు బేడఇవ్వు. తరవాత చూచుకొందాం' అన్నా ఎంతో శాంతంగా మమతతో.

లక్ష చెప్పండి! నోరు విప్పదు. సరిగదా దూరదూరంగా జరిగి జరిగి సత్రపుగోడకు ఆనుకుంది. శాంతం నా హృదయంలోంచి మాయమైంది. చరచరా బీబీదగ్గిరి కెళ్లాను.

నాగుండె ఝల్లుమంది. ఎర్రబారిన ముఖం కనబడింది బురఖాలోంచి. కన్నీ రేకధారగా కారుతోంది. వెచ్చగా శ్వాస విడవలేక విడుస్తోంది నా అర్ధాంగి అకారణంగా! ఆ పాదమస్తకం నిదానించి చూచా. మెళ్లో 'చెయిను' మాయమైంది. సంగతంతా గ్రహించాను. రిక్షావాళ్లను ఏవిధంచేతనైనా పంపించేసి బీబీని ఓదార్చి బుజ్జగించి సంగతి కనుక్కుందామనుకున్నాను. కాని అరవవాళ్లను నమ్మకూడదు. వీళ్లే కాజేసారేమోనని 'వెధవచెయిను పోతేపోయిందిలే. ఏడవకు' అని మరి కాస్త దగ్గరగా వెళ్లాను. ఆమె హద్దులేని ఖంగారుపడుతూ మొదలెట్టిందో హానిరాగం. నాఊహ నిశ్చయమైందనుకున్నాను. ఇంకా ఉపేక్షిస్తే లాభంలేదు! స్థాయిమించి రాగములోకి దిగుతుంది. 'మరి సిగ్గుపడనక్కరలే' దనుకొని ఆమె భుజమ్మీదికి చేయివేస్తూ 'పరవాలేదులే బీబీ. వెధవచెయిను' అన్నా. నా చేయి ఇంకా సగందారిలో ఉండగానే చివాలున ప్రక్కకుదాటుతూ "నేను మీ బీబిని కాను" అంటూ



**శ్రీమతి రామసుబ్బమ్మగారు**

రాయలసీమ నాయకులు శ్రీ క. కోటిరెడ్డిగారి ధర్మపత్ని. ఇటీవల జరిగిన ఎన్నికలలో నీమెను కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలుగ కాంగ్రెసువారిచే ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి. ఇట్టి స్థానము నలంకరించుటకు ఈమెయే ప్రథమ ఆంధ్రమహిళారత్నము.

మొదలెట్టిందో చిన్నపల్లవి. ఆమె లైటుస్తంభము దగ్గర ఉండటంచేత అదాటులోనే కనుపించింది ఆ అపరిచితముఖం మేలిముసుగులోంచి అపరిచితకంఠము తోపాటు!!! అప్రయత్నంగా "బీబీ గారుకాకపోతే మరి మీరెవ" రన్నాను. వణికిపోతూ "రాజా లమ్మాయి నండీ, బెజవాడ" అంది. "అయితే మాబీబీ" అన్నాను కేలగా. "తెలీదు" అంది.

నా హృదయంలో వందరైళ్లు పరుగెత్తసాగాయి. నా మెదడు దిమ్మెపట్టింది. నా అంతరాత్మ నాలో చెప్తుండగానే నాకు తెలియకుండా నా నోటినుండి "అయ్యో బీబీ, బీబీ" అనిపించింది. "ఎన్నా, ఎన్నా" అంటూ అరవన్నలు మూగురు అల్లేసారు నన్ను. నా చిత్తిరిపోయే కాళ్లక్రింద భూమి వణికినట్లగుపించింది. ఎంచేతో రోడ్డు స్పష్టంగా కనపట్టం లేదు. లక్ష ఊహాలు నా మనస్సులో 'తటపటా' కొట్టుకుంటున్నాయి. నా ఊహాలన్నింటికీ ఒకటే లక్ష్యం. నా బీబీ—నా బీబీ—నా సర్వస్వము.

ఇకను కంగారుపడితే ప్రయోజనములేదు. రెండే రెండు ఊహాల్ని స్థిరపర్చుకొన్నా. బీబీ మదరాసు చేరకముందే మాయమైందా? లేక స్టేషనులో తప్పిపోయిందా? వీటికి జవాబు శూన్యమే! నా హృదయం ఎందుకో కుదుటపడ్డది. అంతలోనే బీబీ ఏమయిపోయినా ఈ రాజాలమ్మాయి నావెంట ఎందుకొస్తుంది? అనుకున్నాను. కుదమొదల్లేక దుఃఖిస్తున్న ఆమెనుచూచి ఇలా అన్నాను. "మీరేం భయపడకండి. నాతో మీ రెండుకువచ్చారు. పైగా ఎందు కేడుస్తున్నారు.........."

నే నింకా అడగబోతున్నాను. ఘర్జాంగుదూరా నుంచి "అగ్బార్!! అగ్బార్!! రే అగ్బార్!!!" అని పెద్దకేకలు వినబడ్డాయి. వెనక్కి తిరిగిచూశాను. ఆ అమ్మాయి ఆలాపన ఆట్టే కట్టిపెట్టింది. రెండు రిక్షాలు, ఒక సైకిలూ నా దృగ్గోచరమయ్యాయి. ఆ సైకిలుపై ఓ పోలీసు పిక్కబలాన్నంతా వినియోగించి త్రొక్కుతున్నాడు! ముందరి రిక్షాలో ఓ మగాడుమాత్రం కూర్చున్నాడు. వెనుక రిక్షా మొదటిదానికి వెనక్కుండడంచేత నాకు సరిగ్గా కనబడ్డంలేదు.

నా గుండెల్లో పెద్ద బండపడ్డట్టుయుంది. సంగతంతా అవగాహనం చేసుకున్నాను. నా ఖర్మ మిలా కాలింది. అర్ధాంగి అగమ్యగోచరం!! నేనో-పోలీసు స్టేషనులోనా!! నేనేం నేరంచేశాను చెప్పండీ? ఈ అపరిచిత అబల్ని నేను బలవంతానగాని తెలిసియుండిగాని తీసుకొనిరాలేదే! లేకపోతే ఇదంతా అరవపితలాటమా? అనుకున్నా. అనుకుంటూన్నంతలోనే జన్మలోలేని పరాభవము జరగబోతుందేమోనని నామీద నాకే జాలివేసింది. ఆ పోలీసు సైకిలు దిగీదిగడంతోనే "Thank God" అన్నాడు. ఆయువకుడు దిగాడు. సూటూ బూట్సూ అచ్చా నాలాగే తయారయ్యాడు. నాదగ్గరకు గబగబావచ్చి "గాబరా పడుతున్నా వేంటిరా అక్బర్" అంటూ భుజంతట్టాడు నాతో చదువుకున్న రామరాజు!!! ఈలోగా ఆ రెండో రిక్షాలోంచి ఓ బురఖాదిగి "రంయ్"మంటూ వస్తూంది నాప్రక్కకు. నేను నిర్ఘాంతపోయాను. 'వెధవ బురకాల్లే' రా అంటూ మొదలెట్టబోయాడు ఓవర్గన. నాప్రక్కనున్న బురఖా నాచేయి లంకించుకొని "వెధవఘోష" అంటూ మొదలెట్టింది.

# సతీమణి - ఊర్మిళ

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు

నీదు సతీత్వపుష్పదళనిర్గతవాసన, లేఖకుల్ స్వకా
వ్యాదుల జిల్కరింపక కటా తెఱచాటున డాచినారు, భా
షాదివిశేంద్రకన్య తనచాతురి నీరసమైచనంగ సం
ఛాదితముం బొనర్చెఁ గరచాలనవృత్తిని దేవి యూర్మిళా!

పతి విరహంబు, దుఃఖముల పజ్జనివాసము, గోటిపావ కో
ష్ణత వివశత్వ దేహలత, సాధ్వరో! నీదగు లేయెడందలో
నతి తుములత్వమొందు ప్రణయార్భటి యెవ్వఁడెఱుంగగల్గు నో
సతి! దిగధీశులాదలను జల్లిరో, మంగళ శోభనాక్షతల్.

రావణు కుంభకర్ణులు పరాక్రమధుర్యులు, వారికన్ననా
రావణి వీర్యవంతుఁడు, రణంబున దిట్టరి, వానిజంపె నీ
పావనశక్తి లక్ష్మణుని బాణముఖంబున—వాడె కాదు—లో
కావలియే వడంకు ననలైన సతీమణి రూక్ష వీక్షణన్.

కవు లుచ్ఛృంఖలులున్ నిరంకుశులుగాఁ గాబట్టియే పుట్టఁ బు
ట్టువు రామాయణ కావ్యమందొక అనుష్టుప్ శ్లోకమున్ నీచరి
త్రవిధంబుం దెలువంగ వ్రాయఁడు, విచిత్రంబౌను సాధ్వీమత
ల్లివి, స్వర్ణాక్షర లేఖ్యమానుగద తల్లీ! జాలియౌ నూర్మిళా!
ఆయత కరుణామతి రామాయణ కావ్యంబువ్రాసి అతిశయకరుణా
స్థాయియగు నూర్మిళాసతి, నే యవలంద్రోసె విరహిణియగు నవోఢన్.

తులసీదాసు దయార్ద్రచిత్తుఁడనియే తోచున్ సరేగాని, మి
క్కిలి జాలింగలిగించు పూజ్య గృహలక్ష్మి ధ్యేయమైయొప్పు ను
జ్వలమౌ నీచరితంబు వ్రాయఁగఁదలంపఁ లేదు, చోద్యంబు, వా
రలునీలేత యెడందలో క్షుభిత పారావారముం జూడరో!

మాండవీశ్రుతకీర్తు లఖండకోటి, పావకాధిక విరహతాపంబు గనరు
వారిచరితంబు వదలిన వదలవచ్చు, గాక ఉల్లేఖ్యమగు నీదు కథ; నిజంబు.
పతివియోగంబు జెంది ఆపత్తు లలము,కొనిన వాటిలోఁగడ తేరి—కోలుకొనిన
చంద్రమతి—దమయంతియు—జానకియును, గవుల చుట్టములే—నీవుకాదె—చెపుమ?
విమల విజ్ఞాన దీపంబు వెలుగుచుండ, శాంతి పుష్కరజలముల స్నానమాడి
పతినిబూజించి భావ పుష్పముల భక్తి, నతివిశుద్ధ మనోవృత్తి నలరినావు.

వదెనెయు నగ్రజుండు వనవాసము జేయ నియుక్తులైననుఁ
వదలెను దానుఁగూడ సుఖవైభవరాశుల, గోతి లక్ష్మణుం
డది బహుకాల్య సౌఖ్యముల త్యాగము వారలయందు భక్తి సం
పద కలిమింబొనర్చె—నది మన్ననపాత్రము గాదె యూర్మిళా!

అంతకుమించు నీదయిన త్యాగము, జానకి రాములందు న
త్యంతము గాఢభక్తి హృదయాన్వితవౌట; వియోగశోకముక్
స్వాంతమునన్ దలంపక;—నిజప్రియనాథుని వెంటబోక నీ
మంతిని! సాహసించితివి మందిరమందె వసింప నూర్మిళా!

పతితోఁ దాను నరణ్యభూములకుఁ బోవంబూనుచోఁ బూజ్యలా
క్షితిజారాముల సేవకుఁ గలుగుఁ గించిత్తైన విఘ్నంబు, జీ
వితనాథుండు స్వసౌఖ్య సంగ్రహణమే వీక్షించునంచెంచి యీ
గతి, సౌఖ్యంబులకుం దిలోదక మొసంగం బూనితే యూర్మిళా!

సతులకలంకార మతిమహిమాఢ్యంబు స్త్రీరూపుగొనిన సతీత్వ మీవు
పతిభక్తి భువనసంతతి కుదాహరణ గాఁ గాన్పింపఁ బుట్టిన గారివీవు
స్త్రీజాతి గౌరవ తిలకమై ప్రభమించి చదలరాజిల్లు నక్షత్రమీవు
పుణ్య హిందూమతాంభోజలావణ్య నిర్మలత కాధార నీరంబవీవు
ఎట్టి శాపముననొ జనియించి యున్న; ఆత్రిమూర్తుల దేవుల నతిశయించి
వెలయు భారతదేవివి—వేదమాత ననుచుఁదోచెడి—నూర్మిళా—అనఘచరిత!

చెదరెను ముంగురుల్ వడఁకుజెందిన కోమలదేహవల్లి, పీ
డ్వడు వసనంబు తొట్రిలెడువాతెర, అశ్రులుధారగాగ జా

ఱెకు కనుదోయి మాసిన ధరించినచీరచెఱంగు, బిట్టు కా
అడవుల వాంఛితాచ్ఛ కుసుమార్థము ద్రిమ్మఱు వీక్షణాళి, క
న్పడెడిని నీదుమూర్తి—దురవస్థయు మాహృదయాల జిచ్చుగాన్.

తల్లీ యేమి యొసర్పగల్గుదుము పూతంబైన నీమూర్తియే
ఎల్లప్డుం మమువీక్షకుండు, నది మాధ్యేయంబునన్ నిండి రా
జిల్లంగల్గు సమస్తలోక గృహలక్ష్మీ మండనంబౌచు, శో
భిల్లన్ మాకులదేవివై సరగ దేవీ రాగదే యూర్మిళా.

చిన్నవయస్సు కోర్కులు విభిన్నత నాథుని ప్రేమచొక్కు—న
భ్యున్నతి చూడజాలని అయోగ్యుడు ధాత యొనర్చెబో, నిరా
పన్నత ద్వచ్చరిత్ర సుమవాసన తెల్లెడ నిండిపోయె—నీ
కన్న సతీమతల్లులిక గల్గరుబోయని యెంతు మూర్మిళా !

# ఆంధ్ర సోదరీ!

శ్రీ వారణాసి వేంకటేశ్వరులుగారు

ఆంధ్రకవితాకలా విలాసాభ్యుదయము
ఆంధ్రరాజేంద్రవిపుల శౌర్యప్రదీప్తి
ఆంధ్రసచివోత్తమ ప్రతిభాతిశయము
ఆంధ్రగాయక గానవిద్యావిభవము
ఆంధ్రమహిళా పతివ్రతాత్వమలచరిత
ఆంధ్రసూనృతదాన ధర్మాభిరతియు
సరసి,నాడునీనాడు నేకొఱతలేద
టంచు పొరుగువారికి బ్రకటించుకొఱకు
నిరుపమాంధ్ర రాష్ట్రోద్యమ నిరతినొరసి
ఆంధ్రసోదరీ! చరియింపుమమ్మ! యిపుడు.

లలితశృంగారశోభావిరాజమాన
కృతిని రచియించి సత్కీర్తినెనసినావు
ప్రబలసంగ్రామకలనకై భయమువకడ
లేతచేతులగత్తి గీలించినావు
లలి పతివ్రతా సంరక్ష సలుపుకొఱకు
నురుతరానల శిఖలలో నురికినావు
వీరపత్నీత్వధర్మంబు వేగిరింప
నూరిపోసినావుపతికి వీరరసము
అన్నిశక్తులు నీయందెనలరె; నాంధ్ర
సోదరీ! తడవేల రాష్ట్రోద్యమమున !

ఆంధ్రజనని స్వేచ్ఛాపీఠ మధిగమింప
ఆంధ్రజాతీయతా భావమనువుకెంద
ఆంధ్రసుస్థిరోజ్జ్వల తేజ మచ్చుపడగ
ఆంధ్రసౌభాగ్యసుశ్రీల ననుభవింప
ఆంధ్రనగరంబులందెల్ల నాంధ్రసోద
రీమణులు సభల్జేసి యారీతి, మంత్రి
వర్యులకు సభాపతికిని వార్తలంపి,
ఆంధ్రరాష్ట్రము ప్రాప్తించునంతవఱకు
వీడకుడు రాష్ట్రసాధనా విమలదీక్ష
ఆంధ్ర సోదరీమణులార! అమ్మలార!

# స్త్రీ జాతి

## ఆ నాడు — ఈ నాడు

శ్రీమతి ఎ. సుబ్బాయమ్మగారు

ఋగ్యజుస్సామ అథర్వవేదాలు నాలుగున్నూ అపౌరుషేయాలు అనగా, సృష్టికి ప్రారంభంలో సాక్షాత్తు పరమేశ్వరునివలన, సనాతనరూపంతో మానవజాతికి జ్ఞానం-కళ్యాణం చేకూర్చడంకోసం ఋషుల హృదయాల్లో ప్రేరితములైనవని ఆర్యులగు సనాతనుల అభిప్రాయమైవుంది. కాబట్టి వాటిని ఆర్యులందరు తమ మతానికి ఆధార గ్రంథాలుగ భావిస్తున్నారు. ఈ వేదాల వలననే మానవజాతికి ఆదిభౌతిక పదార్థాలకు పేర్లు పెట్టడమునకున్నూ నానావిధ సంస్థల నిర్మాణానికిన్నీ సామర్థ్యం కలిగిందని ఆర్యులంగీకరించాలి.

దీనినిబట్టి వేదాల్లో మానవజీవితాలకు సంబంధించిన వ్యక్తిగతమగునట్టిన్నీ సాంఘికమైనట్టిన్నీ ఆధ్యాత్మికమగునట్టియు చరిత్రను తెలియచేసేరూపం చిత్రింపబడి వుంటుందనే సిద్ధాన్తాన్ని మనం స్థిరపఱచుకోవాలి. ఈ ప్రపంచానికి చెందిన రహస్యమయ సంఘటనలకు సంబంధించిన విషయం వేదాల్లో స్పష్టీకరింపబడివుంటుందని మనం వూహించాలి. ఈ మనగ్రంథాలు ఈశ్వరీయాలా కావాలనే ప్రశ్నసాధారణ విద్యావంతులు చర్చింపదగినదికాదు. మొత్తంమీద మానవ జాతికి సంబంధించిన ప్రతిప్రశ్నయు వీటిలో చక్కగా స్పష్టంగా చర్చింపబడివుందని యెల్లరు అంగీకరింపక తప్పదు.

సామాన్య విషయాలు సైతం ఈ పవిత్ర గ్రంథాల్లో చర్చింపబడివున్నవి; కాని మనకు ప్రస్తుతం అవసరమైనది స్త్రీజాతి గురించిన ప్రశ్న. ఈ రోజుల్లో మనకొరకు పురుషులు పడుతూవున్న పాట్లు, మన స్వాతంత్ర్యంకోసం వారు చేస్తూవున్న భగీరథ ప్రయత్నాలు మన ఔన్నత్యంకోసం వారు నడుపుతూ వున్న ఉద్యమాలు సరిక్రొత్తవనీ వారట్టి ప్రయత్నాలు చేస్తున్నందుకు మనం వారికెంతో కృతజ్ఞలమై వుండాలనీ చాలమంది సోదరీరత్నాలూహింపవచ్చును; గాని ఈ ప్రయత్నాలలో ఒక్కటికూడ క్రొత్త భావంతో కూడినది కాదనీ స్త్రీజాతికి పూర్వంనుండి పరంపరానుగతంగా వస్తూవున్న స్వత్వాధికారాలనే మనవారు మనకోసం పునర్నిర్మాణం చేస్తున్నారనీ నారీ ప్రపంచానికి వెల్లడిచేయడం ఈ నావ్యాస

రచనకు కారణం అని మనవిచేస్తున్నాను. వైదికకాలంనాటి మానవసంఘాల్లో స్త్రీ జాతికేలాటి స్థాన మొసగబడివుండెనో చూడండి.

"సఖుడు" "మిత్రుడు" అను ఈ రెండు శబ్దాలున్నూ స్త్రీపురుషసమానత ఏలాటిదో బోధపరుస్తున్నవి. మిత్రత్వంలో మనం మన భేదభావాలన్నీ మరచిపోతున్నాం. వేదాలు-పురుషుడు స్త్రీకి మిత్రుడనిన్నీ-స్త్రీ పురుషునకు "సఖ"యనిన్నీ చెబుతూవున్నాయి. ఋగ్యజుర్వేదాల్లో స్త్రీ "ఉష"తో సమానముగా అనగా ప్రభాతంవలె చక్కనిదిగ వర్ణింపబడినది. మానవసంతతి మధ్యనుండి తనంతతానే మిత్రుని ఎన్నుకొని స్వీకరించే అధికారం స్త్రీకి ఒసగబడినట్లు వేదమంత్రాలు ఘోషిస్తున్నవి. ఆడుబిడ్డల వివాహవయో నిర్ణయ సమస్యనుగురించి భూమి-ఆకాశం తలక్రిందులైనట్లు మనవారు ప్రయత్నించడం మనకు క్రొత్తిగా కనబడవచ్చును. గతించిన కాలంవైపు మనం మనదృష్టుల్ని మళ్లించితే ఈసమస్య వేదాల్లోనే నిర్ణయింపబడివుందని తెలుస్తుంది. నాటికి నేటికిగల మధ్యకాలంలో ఏకారణంచేతనో బాల్యవివాహోద్యరిష్టాలు సంఘంలో జొచ్చినవి; కాని ఈప్రయత్నాలు మాత్రం క్రొత్తవి కావు. స్త్రీపురుషుల "మైత్రి"గురించిన ఉపదేశవాక్యాల వేద మంత్రాల్లో స్వర్ణాక్షరాలతో లిఖింపబడి వున్నాయి. ధనార్జనలోను వ్యవసాయం చేయడంలోను పతికి సహాయం చేసేదిగ పత్నిని చిత్రించారు వేదాల్లో. పత్నిపతు లిద్దరున్నూ సమానోద్దేశములు గలవారై యుండాలని వేదాలు ఆదినుండి చాటుతూ వున్నాయి. భోజనాదిభోగాలు దంపతులు సమానంగా అనుభవించాలని స్పష్టంగా ఘోషిస్తున్నవి వేదమంత్రాలు. స్త్రీ తాను తన ఉన్నతికై పాటుపడుతూ పతిఔన్నత్యానికి ప్రయత్నించాలని వేదమంత్రాలు విధిగ శాసించినవి. కేవలం ఈ ఒక్కవాక్యం స్త్రీకి ఆనాటి మానవసంఘాల్లో ఈయబడిన గౌరవ స్థానాన్ని ప్రకటిస్తోంది. మోక్షప్రాప్తికి సైతం స్త్రీ అనుజ్ఞాపింపబడినట్లు యజుర్వేద మంత్రాల్లో చెప్పబడివుంది.

వేదార్థజ్ఞానం సంపాదించి ప్రపంచంలో తత్ప్రచారం చేయడం, విద్యావతికావడం ఎక్కువగ పాకవిద్యాజ్ఞానసముపార్జన చేయడం, క్షత్రియ లక్షణాల్నిధరించి వీర వనితకావడం ఇవన్నీ స్త్రీకొరకు ఒసగబడిన విధులు. పురుషునితో సమానంగా స్త్రీధనం పంచుకోగలదు. ఈహక్కు సైతము అనాది నుండి ఆమె కొసగబడినదేను.

ప్రాచీన భరతఖండమందు బ్రాహ్మణ సన్యాసులు దేవతలనగా పూజ్యులు, ఋషులు మొదలైనవారు ఉన్నత పదవులను పొందుతూ మంత్రద్రష్టత్వాన్ని పొందే అధికారం కలిగివుండేవారు అదేవిధంగా "ఉపాళ" "ఘోష"అనే వనితలుకూడ పైహక్కులను గలిగియుండేవారని వైదిక ఇతిహాసం చాటుతూవుంది.

యాజ్ఞవల్క్యమహర్షి "బ్రహ్మవాది" ఐతే మైత్రేయికూడ ఆతనితో సమానమైన

"బ్రహ్మవాదిని"గ ప్రసిద్ధిచెందినది. బ్రహ్మజ్ఞానదృష్టిలో ఈ యిరువురకు సమానస్థానమే ఒసగబడినది. స్త్రీపురుషుల సమానత్వానికింతకన్న గట్టి ఉదాహరణ అవసరమా? ఆదినుండి స్త్రీకిగల హక్కులను మధ్యకాలంలో పురుషుల స్వార్థపరత్వంచేత అడుగంటిన హక్కులను (పురుషులకు కోపం రావచ్చు) పునః వారికోసం సంపాదించి పెట్టడము ఒక నూతనోద్యమం కాదని దీనివలన స్పష్టమవుతూవుంది. మనదేశపు తొల్లిటి గౌరవానికి మన ఆనాటి నారీమణులే కారణం ఐతే కారణాలేలాటివైనా మధ్యకాలంలో మాసిపోయిన స్త్రీలహక్కుల్ని పునరుద్ధరించడానికి వారు పురుషులద్వారా ప్రభుత్వచట్టాల శరణు దూరవలసివస్తోంది.

దీనికికారణం-మనమగవారు మనకుఉచిత విద్యలు (కాలేజిచదువులుకావు) గఱపక పోవడం మనల్ని సేవికాస్థానంలోనే అణచివుంచడం మనమగవారిప్పుడిప్పుడు మనకోసం కొన్నిప్రయత్నాలు చేస్తున్నారు; వీటికి రాజకీయాలు కారణాలని నాబోటి అమాయకురాండ్ర ఊహ. ఏనాడు మనమగవారికి స్త్రీజాతి నుద్ధరించుదామనే మానసికమగు మార్పువస్తుందో ఏనాడు మన వేదగ్రంథాలు అందరకు సులభంగా బోధపడేలాగున ముద్రింపబడునో, ఆనాడుమనజాతికి పోయిన గౌరవం తిరిగివస్తుంది. స్త్రీజాతికి గౌరవం, స్వాతంత్ర్యం లభించినపుడే దేశానికిస్వాతంత్ర్యం రాగలదు.

రష్యాస్త్రీలు, ఇన్నాళ్లూ నాల్గుగోడలమధ్య మ్రగ్గి మొన్ననే విముక్తలైనారు. కాబట్టి తమదేశ సౌభాగ్యాన్ని అన్నిఖండాలవారికి చాట గలిగినారు. నిన్నటివరకు నిద్రాపరవశులైవుండిన చీనాస్త్రీలు నేడు తమదేశ స్వాతంత్ర్యంకోసం మగవారికి తోడ్పడుతూ అగ్నిజ్వాలలకు ఆహుతియగుచున్నారు. తిన తిండిలేక, నిలువడలేక, ఉన్న కొద్దిచోటు మాటిమాటికి భూకంపాద్యనిష్టాలవలన ధ్వంసంకాగా ఎట్టెట్టులో ప్రాణాలుపిడికిళ్లబెట్టుకొని జీవిస్తూవున్న జపానులలనలు ఈనాటిబలవత్తరములైన జాతుల్ని ఎదిరించడంలో తమ మగవారికి తోడ్పడునంతటి సాహసవతులైనారు. ప్రపంచ స్త్రీజాతికి వన్నెతెచ్చినారు. మనం మన తొలిచదువులనుత్రోసివేశాము; పరిశ్రమల్ని విస్మరించాం; సున్నితాలైన పనులైతే చేస్తాం పనికిరాని కాలేజి చదువులపైని ఎక్కువఅభిరుచి కలిగివుంటున్నాం. సంస్కారాలంటాం. నాగరికత అంటున్నాం. ఈ సంస్కారాలకోసం అనవసరంగా తగవులాడుకొంటూవున్నాం. మన పూర్వికులు యుక్తవయసులకే పెండ్లిండ్లు చేసేవారు. వైధవ్యాన్ని అరికట్టేమార్గాలు అవలంబించి అన్నివిధాలా మానవలోకానికి ఆయుర్భాగ్యాలు ప్రసాదించారు. మనం నాగరికతపేరిట మన ఆయుర్భాగ్యాల్ని క్షీణింపచేస్తున్నాం. నిరోధోపాయాలు కనిపెట్టిన మన పూర్వపువారు గొప్పవారా? మనమా? ..ఆలోచించండి !!

# మన అల్లుడు

శ్రీమతి కోకా హానుమాయమ్మగారు

ఆవేళ గోపాలరావుగారింట్లో భోజనాల సందడి. చుట్టాలు, పక్కాలు చాలామంది వచ్చియున్నారు. అతని కూతురుకు అన్నప్రాశన మాటోటా. లేక లేక పుట్టుటచే చాలా ఆడంబరముగా జేయుచున్నారు. బంధువుల రాకకు పరిమితియే లేదావాడు.

రాత్రికి భోజనాలు; గోపాలరావు భార్య పట్టి అమాయకపుది. ఇలాంటి విషయాలేమి ఎరుంగనిది. కనుక, తన అప్పచెల్లెలు దగ్గఱలోవుంటే ఆమెను పిలిపించుకొని ఈ కార్యము నెరవేర్చుమని కోరినది. అక్కకూతురునీ అల్లునీకూడా పిలిపించుకొని ఇదివరకే తనదగ్గఱవుంచుకొనియున్నది. నూత్న వధూవరులగువారు తన యింట్లోవుంటే ముద్దూమురిపెము చూచుకోవచ్చునని.

జానికమ్మకు ఇద్దఱు కొడుకులతర్వాత ఈబిడ్డ పుట్టినది. బిడ్డగాదు బంగారుబొమ్మ యని యా ఆలుమగ లత్యానందముతో మురియుచుండిరి. పిల్లలు కలగరేమోయని నిరాశచేసుకున్నా రా దంపతులు. అట్టి నిరాశాంధకారములో జ్యోతిర్లతవలె ఈ ముద్దుకూన పుట్టగానే వారి యానందమునకంతు లేదు. తన చిన్నారికి అన్నప్రాశనము. నేడు వారి హృదయము లత్యంతకౌతుకాన్వితములై, క్రొత్త క్రొత్త కోర్కె లీనుచుండుట వారి మోములే చెప్పక చెప్పుచున్నవి చూపఱులకు.

ఇట్టిసమయములో జానికమ్మ రెండోకొడుకు వచ్చి 'అమ్మా, బావ కాఫీ త్రాగలేదూ. కాఫీహోటలుకి వెళ్లి కాఫీ తెమ్మని ఎవరికో డబ్బులిచ్చి పంపుతున్నాడు' అని, కొట్లో సామాన్లు తొందర తొందరగా అందిస్తూవున్న జానికమ్మ చెవులో వేశాడు.

'ఏమిటీ అబ్బాయి. బావ కాఫీ త్రాగలేదూ, నిజంగా చెప్పు. ఓరి వెధవ. ఆ అకతాయిగుంటడు రాముడు అందరికీ సమంగా కాఫీ పోయలేదుగా మాలున్న, ఏమి బుద్ధి. అయ్యో! అక్కా! మన అల్లుడు కాఫీ త్రాగనేలేదట' అని తొందరతో అక్కదగ్గఱకు వచ్చి కేక వేసింది జానికమ్మ.

'పులావ్‌లో ఎంత జీడిపప్పువేద్దామా' అని కొలత వేస్తూవున్న సుభద్రమ్మ ఈమాట వినగానే గిఱ్ఱున తిరిగి 'ఏమి చెల్లీ! దొంగవెధవ రాముడు ఇవ్వనే లేదా! మన అల్లుడికే అందిందికాదే, ఈ గందరగోళములో అతగాడికి ఏమి కోపము వచ్చునో కదా! ఏమి ఖర్మం, చూడు నాయనా! అదెంత నిజమో కనుక్కోనిరా' అని చిన్నబ్బాయి భుజముమీద చేయి వేసి తొందర జేసింది. 'నిజమే! పెద్ది! డబ్బులీయడం నేను చూచాను' అని నొక్కిచెప్పాడా అబ్బాయి.

'అ, అలాగా! ఆ మొద్దువెధవతో కాఫీ యిచ్చి రమ్మన్నాను. ఎవరికి యిచ్చినాడో ఏమిటో. 'వాడేడీ' అని కోపంతో అటుయిటు చూడగా రాముడు ఒకచేత్తో కిరసనాయిల్ బుడ్డీ ఒకచేత్తో అగ్గిపెట్టి పట్టుకొని ఆదారినే వెళ్లుతూండడం కంటబడిందామెకు.

'ఇదిగో వాడే. అదద్దమ్మ. ఒరే దద్దమ్మా! కాఫీ అల్లుడు బాబుకు ఇవ్వనేలేదురా? నీ తెలివి కాలిపోను' అని కోపముగా చూచింది.

'ఇచ్చానమ్మా! ఇవ్వలేదని ఎవరు చెప్పారు. త్రాగుతూ ఆ బాబుగారే అన్నారు పంచదార ఎక్కువయిందిరా అని. త్రాగేవరకు దగ్గఱనే వున్నాను'. ఈమాట లాలకించగానే అప్పచెల్లెళ్లిద్దఱు నిలువుగుడ్లు వేశారు. 'ఇదేమిటీ! అబ్బాయి అలాచెపుతే వీ డిలా చెప్పుతాడు' అన్నది సుభద్రమ్మ. 'అబ్బాయి తెలియక అలాఅన్నాడు. వీ డెందుకు అబద్ధం చెపుతాడు' అని సమాధానపడ్డది జానికమ్మ. 'పీడి మొహం. అబ్బాయి అంత నొక్కి—

చెప్పుతూవుంటే ఈ దొంగవెధవమాటలకేమి, పెద్దవాళ్లెవరినైనా కనుక్కుందా' మన్నది సుభద్రమ్మ.

ఇంతలో గోపాలరావు వంటప్రయత్నాలెంత వరకు అయినాయి అని అడుగుతూ అక్కడకు వచ్చారు.

'చూశారూ! మన అల్లుడు కాఫీత్రాగలేదట. అదేదో కాస్త కనుక్కుందురూ! ఈ గందరగోళంలో అతగాడికి ఏమి కోపమువచ్చునో కదా' అని జానికమ్మ మగనితో అంది. 'ఆ! ఎందుకు తాగలేదూ, రాముడు కాఫీ అందరికీ పోసినట్టున్నాడే' అన్నారు గోపాలరావుగారు. గాభరాగా 'అదేదో కాస్త కనుక్కో అబ్బాయి తెలుస్తది' అన్నది వదినగారు మరదితో. 'ఆ! అలాగేనమ్మా! కనుక్కుంటా' నని వీధివరండాలోకి వెళ్లి అల్లుడేడీ అని విమర్శించారు. ఎక్కడా అగుపడలే. ఎవరినడిగినా తెలియదన్నారు. 'మన అల్లుడు ఎక్కడకో వెళ్లియున్నాడు. వస్తే కనుక్కుంటానని' కేక వేసి వెళ్లిపోయారు.

అప్పా చెల్లెళ్లా మాటవిని నివ్వెరపాటుతో ఒకరిముఖం ఒకరు చూసుకొన్నారు.

మన అల్లుడు కోపం తెచ్చుకు బయటికి వెళ్లిపోయుంటాడా? అని వారిలోవారు తర్కించుకున్నారు.

'చెల్లీ! మన అల్లుడు అంత ముక్కోపా? అంత మాత్రంలో అలుగుతాడా?' అని అక్క లేనిధైర్యం తెచ్చుకుని అడిగింది చెల్లెలిని. 'ఛా, ఛా, నాకు తెలియదు. అతడిగుణం చిన్నప్పటినుండి నా కెఱుక అంత మంచివాడనే కదా మనపిల్లకి అవాలని అంత పట్టుదలతో వుండేదానను' అన్నది చెల్లెలు.

అప్రక్కనే పరమాన్నంలోకని కిస్మిసిపండ్లు, ద్రాక్షపళ్లూ, యాలక్కాయలూ, జీడిపప్పూ అమర్చబడియున్న తట్టదగ్గఱ కూర్చొని నోట్లో ఒకొక్కటే వేసుకుంటూవున్న జానికమ్మ పెద్దకొడుకు విశ్వేశు అందుకుని 'మన అల్లుడికి ఎప్పుడూ కోపంలేదు గాని, ఈవేళ ఎక్కడాలేని కోపవచ్చింది. ఈ ఇంట్లో కొంచెమూ మర్యాద తెలియదు అని ఎవరితో అంటూవుంటే ఆలకించాను' అని ఒక పుల్లరాజ వేశాడు.

జానకమ్మ పెద్దకొడుకు ఇలాంటి విషయాలలో అందుకుని కథకు రమ్యంతెచ్చే పాత్రధారి. అక్కాచెల్లెళ్లు ఆందోళనపడడం వింటూవున్నాడు. వారికి మరింత గాభరాచేద్దాం అని బుద్ధిపుట్టింది. తలంపు కలుగగానే తనకు తోచిన పాచిక వేశాడు. 'ఏమిటీ నిజంగా ఏమన్నాడు బాబూ!' అని ఇద్దరూ ఒక్కసారి అడిగారు. 'అవునే. అమ్మా! నిజమే'నని నొక్కి మరీ చురుగ్గా కళ్లెత్తి అన్నాడు. తల్లి వట్టి అమాయకపుది అని తెలుసు. అందుకని మరీ చిక్కుప్రశ్నలలో పెట్టి ఆమెను వెఱ్ఱిదానిలా ఆడించడంలో విశ్వేశు గట్టిదిట్ట.

'నిజమేనా నాయనా! నీవు ఎలా ఆలకించావు, ఎవరితో అంటుంటే ఆలకించావు' అని పెత్తల్లి వంగి విశ్వేశు తలయెత్తి అడిగింది.

'వాడి మొహం, లేనిపోనివి చెప్పడానికి వాడి తర్వాతే' అంది తల్లి.

అన్నదేగాని గుండెలు లోపల కొట్టుకుంటున్నాయామెకు.

ఇంతలో వంటబ్రాహ్మడు వచ్చి 'అమ్మా! కూరలన్నీ ఉడికిపోయాయి. పులావ్ అంద పొయ్యిమీద వేయాలి. వస్తారా?' అని అడగడం వారి ఆలోచనల కడ్డుతగిలింది.

'అన్నట్టు మనం ఈ సొదలోబడి అసలు సంగతే మరచిపోయాము. అయ్యో, ఎంతవేళయిపోయిందీ, పోనిస్తూ, పిల్లనిచ్చాక ఎన్నయినా పడాలి. ఎలా వస్తే అలా రానీ' అని లేని వుత్సాహం తెచ్చుకుని సుభద్రమ్మ వంటప్రయత్నంలోకి వెళ్లబోయింది.

ఇంతలో గోపాలరావుగారు పైనుండి కేకవేశారు. ఇదిగో మన అల్లుడు ఇక్కడే కాఫీ త్రాగేడట. మీరు మరేమి గాభరాపడవద్దు అని. ఇది ఆలకించి విశ్వేశు, నాన్నా! అమ్మా, పెద్దీ, మన అల్లుడు కాఫీ త్రాగలేదని వెంగపెట్టుకున్నారు అని కేకవేశాడు. కొంటెపిల్లడు ఎంతకైనవున్నాడే అని పెత్తల్లి చిన్న దెబ్బవేసింది భుజంమీద. ఇపుడు పాపం! అప్పాచెల్లెళ్లకు ఎక్కడాలేని బలం వుత్సాహం వచ్చింది. ఇద్దరూ నవ్వుమొహాలతో చూసుకున్నారు.

— ౩ —

రాత్రి పదిగంటలకు భోజనాలు జరిగేను. ఇంతలో సుభద్రమ్మకొడుకు పెద్దవాడు వచ్చి 'అమ్మా! పాయసము చాలా బాగుందే, మరీ మైసూరుపాకము ఎవరు చేశారే! పిన్ని చేసిందా చాలా బాగుందే, మరీ, భావ మా బంతిలో భోంచేయలేదేమి' అన్నాడు తల్లిదగ్గరకు వచ్చి. 'అన్నా! ఎంతమాట మనఅల్లుడు భోంచేయలేదంట చెల్లీ!'

'అతన్ని సరిగా పిలిచి కూచోపెట్టినవాళ్లు వుంటే కదూ, అవురా! అబ్బాయి! బావ భోంచేయ లేదని మెల్లిగా చెపుతున్నావు, ఛీ, దద్దమ్మా! పిలిచి పక్కన కూచోపెట్టుకోకుండా ఎలా భోంచేశావ్? నీకంతమర్యాద ఏడుస్తే కదూ' అని కొడుకుని కేకలు వేసింది సుభద్రమ్మ. 'అదేమో! నాకేమి తెలుసు, పెద్దవాళ్లంతా వుండగా నేనా పిలచేది, పిలుస్తేమాత్రం వస్తాడా' అని ఆ అబ్బాయి కస్సుమంటూ వెళ్లిపోయాడు. అయ్యో గ్రహచారమా! మన అల్లుడుకే ఆఖరికి సున్నం అని ప్రక్కనున్న విశ్వేశు అందుకున్నాడు.

'వీడు ఒకడమ్మా మనని శోకాకోశం చేయడానికి, చూడునాయనా, నువ్వు కొంచెము కనుక్కురా', అని బుజ్జగిస్తూ పెత్తల్లి తొందరపెట్టింది. 'అదేమో నాకు తెలియదు మధ్యాహ్నం కాఫీ అందలేదూ, ఆ కోపానికే యిపుడు భోంచేయలేదుగామాలు, మన అల్లుడో మనఅల్లుడో అని ఒకర్పడమే గాని ఎవరూ అతన్ని సరిగా కనుక్కోరు, ఇద్దరత్తలుండీ' అని భీష్మించుకొని నిలబడ్డాడు.

'అవును, నిజమే, బిడ్డడు అన్నట్టు, అతడిని సరిగ్గా కనుక్కునేవారే లేరు, అందుకే కోపం వచ్చివుండొచ్చు' అని సుభద్రమ్మ చిన్నబుచ్చుకుంది.

'ఛా, వీడి మాటలకేం, అతడంత కోపిష్ఠా, నాకు తెలియదూ' అంది చెల్లెలు, అక్కమాటలు తోసిపుచ్చి.

వాళ్ల మట్టుకి వాళ్లే ఇన్నిమాటలు అనుకుంటూరు గాని, నిజమయిన సంగతేమిటో కనుక్కురమ్మని పెద్దవారి నెవరిని బయటకు పంపరు.

ఇలా వుండగా వడ్డనబ్రాహ్మడు వచ్చి, 'అమ్మా! ఆడవాళ్లంతా విస్తరాకులదగ్గర కూచున్నారు. వడ్డించమంటారా!' అని వాళ్ల ఆలోచన కడ్డువచ్చాడు.

'అవునా? అబ్బీ! అల్లుడుబాబు బంతిలో కూచోలేదూ' అని ఇద్దరూ ఏకకంఠంతో అడిగారు.

'అవునమ్మా, చూసినట్టున్నాను, కాకీ కమీజా పైనవాణే వేసుకున్నవారు కదూ.'

'ఆ! ఆ! అతనే' అని వుత్సాహంతో అన్నారప్పచెల్లెళ్లు.

ఆ ప్రక్కనున్న విశ్వేశు 'అతడు కాడే, కాకీ కమీజా మనఅల్లుడు ఒక్కడే వేసుకున్నాడా? ఈ గుడ్డి వెధవ చెప్పడం, మీరు నమ్మడమూను!' అని వారి వుత్సాహం అంతా ఒక్కదెబ్బతో ఎగరగొట్టాడు.

'ఇదేమిటే, అబ్బాయి అన్నట్టు నిజమే ఇంకెవరినయినా అడుగుదాం' అని బుర్రీ? అంటూ లేచేసింది. పాపం, ఈ అప్పచెల్లెండ్రు ఎంతకీ రాకపోవుటచే, వంటబ్రాహ్మలు వడ్డించక అలా నిలచిపోయారు.

పాపం, ఆకలిమంటచే ఆకులదగ్గఉన్న ఆడవాళ్లు అలాగే కునుకుతున్నారు. పదకొండున్నరయింది, ఇంకా వడ్డన్లు లేవు అల్లుని సందట్లో.

బుచ్చి ఆరేళ్లవాడు, 'ఏమే అమ్మా', అంటూ వచ్చాడు. 'అవునురా, బావ భోంచేశాడు' అంది సుభద్రమ్మ కోపంతో. 'ఏమోనే నాకేం తెలుసూ! పెద్దవాళ్లంతా ఒకమూల కూచున్నారు. చిన్నవాళ్ల మేమంతా ఒకమూల కూర్చున్నాము. నాన్నైనా చిన్నన్నైనా కనుక్కో' అని బుచ్చి వెళ్లిపోయాడు.

'ఇదేమి కర్మం అమ్మాయి! ఎవరూ సరిగా కనుక్కునేవారే లేరే' అంది నిట్టూర్పు తీస్తూ సుభద్రమ్మ. ఇంతలో గోపాల్ రావు 'ఏవ్రా ఆడవాళ్ల భోజనాలయినాయా' అంటూ తేనముద్దుల కూతుర్నెత్తుకుంటూ వచ్చారు.

అక్కడున్న వంటవాడు 'లేదూ బాబూ! అమ్మగారూ! సుభద్రమ్మగారూ, ఏదో గాభరామాటలనుకుంటున్నారు' అన్నాడు. 'ఏమి గాభరామాటలూ' అన్నాడు గోపాలరావు.

'నాకేమి తెలుసు బాబూ! ఏదో అల్లుడు బాబు గురించి మాట్లాడుకుంటున్నారు, సుస్తీ యేదో చేసిందట. అమ్మగార్లిద్దలూ చిన్నబోయిన మొహాలతో వున్నారు, ఎక్కడ పనులక్కడే వున్నాయి' అని వాడు తెలిసీ తెలియనివార్త ఆయనతో మెల్లగా ఏకరువు పెట్టాడు.

'అరే, ఏమిసుస్తీ ఇందాక మాఇంటిలో భోంచేశాడే అల్లుడు. ఇదేమిటీ' అని ఆత్రుతతో లోపలికి వెళ్లారు. ఇల్లంతా నిశ్శబ్దం.

'ఏవ్రా! మనఅల్లునికి ఏమయిందీ' అని అడిగారాత్రుతతో.

'ఏమయింద'న్నారిద్దలూ దిగాలుపడి. 'ఏమో వీరంతా అల్లునిగురించి గాభరాగా మాట్లాడుకుంటున్నారట. ఇప్పుడిప్పుడే బంగారంలా మాఇంటికి భోంచేశాడే, ఏమయిందిప్పుడూ' అని నివ్వెరపాటుతో అడిగారు.

'ఆ! ఏమిటే! అల్లుడు భోంచేశాడు. అమ్మగుంటలు ఎంతకైనా తగుదుర్రా. మనఅల్లుడు భోంచేయలేదని ఆ గుంట వెధవ చెప్పాడు. అందుకని యింత కంగారు పడ్డాము అంతే' అన్నారా మగువలు నగుమొగముతో.

'ఓసి, ఇదా! వెఱ్ఱివాళ్లు! సరిగా ఎవరినైనా కనుక్కుంటే తెలియదూ? ఆ ఆకతాయి గుంటలు చెప్పడం, మీరు ఇంత కంగారు పడడం, మంచి బుద్ధిమంతులే, కానీండి. ఇంకా భోజనాలే లేవు. ఇపుడు పన్నెండు ఆయింది. ఛీ! ఛీ! ఈ ఆడవాళ్లకు ఇదొక వెఱ్ఱిఅల్లుకో అల్లుకో' అని అని నాలుగుచీవాట్లు వేశారు.

ఇంతలో అల్లుడు వచ్చాడు. మామగారు జరిగినదంతా చెప్పారు.

# ఇంటిలోని పోరు

శ్రీమతి కె. యస్. రత్నాదేవిగారు

కొత్త కోడలి వంచు
అత్త మాటల నీవు
చిత్ర మాదిరి జూచి
పెత్తనా ల్కెల్లీవు
చెప్పినది చేయకే—సోదరీ
పాడిగా దాబాట—సోదరీ.

ఇంట నిందరు యుండ
రొయింటినై నే నేల
యింటి పనులా నెల్ల
యీడేర్ప వలెనంచు
యీసడించ బోకు—సోదరీ
యింటి వారల నేరి—సోదరీ.

ఆడు బిడ్డల తోడ
తోడి కోడండ్రతో
సంగోరు పని యేమి
చేయలేదని నీవు
తగవు లాడాబోకు—సోదరీ
తద్దినాలే యవ్వి—సోదరీ.

బావ, మరుదులు, సతులు
బడితలల్లే యుండ
బండ చాకిరి మనము
చేయనేలా యంచు
మతి విరయకే నీవు—సోదరీ
మంచిగా మెలగవే—సోదరీ.

పిల్ల జెల్లా తోటి
కొల్లగొట్టుకు తినెడి
బావలతో మనమున్న
చిప్ప చేతికి జిక్కు
చీలండి తొందరని—సోదరీ
చీల్చబోకే నీవు—సోదరీ.

తోడి కోడండ్రతో
తోబుట్టువుల రీతి
బావ, మరుదుల తోడ
అన్నదమ్ముల రీతి
ఐక్యభావము జూపు—సోదరీ
ఆనందమందంగ—సోదరీ.

సర్వ మెరిగిన మగడు
సంశ యిస్తుండంగ
వీరు వీరూ రొయికొ
నేనెగా పరకాంత
ననుచు మగనీ మనసు—సోదరీ
మార్చ యత్నించకే—సోదరీ.

యిరుగమ్మ పొరుగమ్మ
యిన్నేసి వగలెట్ట
నాకేవి యని, భర్త
విసిగించు మాటలను
పలుక కెప్పుడు కూడ—సోదరీ
పోరుపు బుట్టును వీలో—సోదరీ.

అత్త మామల మాట
అణచి పెట్టి నీవు
ఆరి, పీరీ, మాట
లాలకించితి వేని,

యింట చిచ్చే బుట్టు—సోదరీ
మంట లెగయుచునుండు—సోదరీ.

పండంటి కాపురము
మండు నేవిధి యంచు
పొరుగమ్మ మీలోన
పొరుపు లెతుకుచునుండు

పొరుపు లుంచాబోకు—సోదరీ
పొందికెరిగే నీవు—సోదరీ.

స్వేచ్ఛగోరే నీవు
చీల దీయగ నద్ది
ఛిద్రముల కాకరంబై
పరివార బంధమ్ము

పాడయ్యి పోవునే—సోదరీ
పోరు మూలం బద్దె—సోదరీ.

యెంతో కాలము నుంచి
నేను రాణిగ నుండ
నిన్న జేరిన గంట
నిక్క లావయె నంచు

గునియబోకే నీవు—సోదరీ
గుద్దులాటలె నిజము—సోదరీ.

అనినాకె యివినాకె
అన్నినాకే యంటు
తాపత్ర యంబుతో
సమకూర్చి యుంచంగ

యిదియేమి టనుకోకు—సోదరీ
మిడిమేల మనుకోకు—సోదరీ.

అన్ని జేసిన దాన్ని
అవతలకు నెట్టేసి
పెళ్లమే బెల్లమే
యనునేమి కొడుకంచు

కారాలు నూరకే సోదరీ
కాలాన్ని చూస్తుండు—సోదరీ.

చిలుక గోర్వంకలా
చిన్ని యాటల నీవు
చూచుచూ కూర్చుండి
ఛిద్రముల రానీక

చేయూత నిస్తుండు—సోదరీ
చెంగు చెంగున దాట—సోదరీ

ఇన్నిటికి మూలమా
యీర్ష్య భావాన్నెపుడు
యింట కాలిడనీక
యీసడి స్తుండవే

ఐక్యభావము నెరిగి—సోదరీ
ఆనంద డోలికలు—సోదరీ.

పిల్లలకు

# నా హిందీ చదువు

"శాస్త్రి"

పరీక్షల ఫలితాలు రాకముందు నేను హరనాథప్రభావం వల్లనైనా ప్యాసవుతాను అనుకునే వాడిని. ఆధైర్యంతో ముందు ప్రోగ్రాములు చాలాచాలా వేశాను. బి. యే. చదువు ఒక పద్ధతి, సరిగదా. యింకోటి, మద్రాసుపోయి ఆనర్సు చదువటమా, లేక విశాఖపట్నంపోయి బి. కాం. చదువా, లేక పోతే, బొంబాయిపోయి ఆర్. యె. కోర్సా, ఏదీ కాకపోతే 'కాం'గా వుంటమా? అనే సందిగ్ధావస్థలో పడ్డా. కానీ ఎటుపోయి ఎటొచ్చినా అన్నిటికి తయారుగావడం మంచిదిగదా అనుకున్నా. తయారు ఏమిటి? డబ్బు తయారంతా పెద్దవాళ్లదిగదా? మన తయారల్లా, పర్సులో వేసుకోటమే. మరిం కేమిటంటే, వెళ్లటంగురించి తయారు. విశాఖపట్నం అంతా మన తెనుగేగదా? యింక మద్రాసు సగంపైన తెనుగే పోనీ అరవం వుందిగదా? నేర్చుకుందామా అంటే, అదెక్కడి భాష బాబూ! కొత్త కుండలో గచ్చకాయలు పోసి గలగల్లాడిస్తే ఎట్లాఉంటుందో ఆభాష మాట్లాడుతుంటే అట్లా వుంటుంది. నాకు మొదణ్ణించీ అస హ్యమే ఆభాషంటే. కాని దాంతస్సదియ్య! అరవ సాంబారు ఏమి రుచండీ! ఆభాషకు రుచి లేకపోయినా, దాని కుందండీ! కాక పోతే ఆంధ్రదేశంలో ప్రతి హోటల్లో ఎందు కుండాలి చెప్పండి ఆ సాంబారు?

సరె, యిక బొంబాయి సంగతి. అక్కడి మనుషులంతా అదోరకరకమంట! మన ఆంధ్రులమల్లే యింగ్లీషులోగాని, మరి ఏ యితర భాషయినా సరే హిందీ తప్ప, మాట్లాడనే మాట్లాడరుట. "భాయీ" అంటేనే నీవంక చూట్టం, 'బ్రదర్, మిస్టర్' అంటే 'ఊహుం.' భలేవాళ్లు! కనుక అక్కడికి పోదల్చుకుంటే హిందీ నేర్చుకోటం చాలా అవసరమేమో నని చెప్పారు; "యివ్వాళాంధ్రులకు యిడ్లీలోకి సాంబారెంత అవసరమో" అంత అవసరమట.

మంచిరోజు చూసి, హిందీ తెలుగు బాలబోధినితో మొదలెట్టానా 'హిందీ చదువు' సొంతంగా. దాని తరువాత 'పహలి' పుస్తకం తెనుగు అనువాదం దగ్గిర పెట్టు కుని పఠించ సాగించాను. అది పూర్తికాక ముందే పరీక్ష ఫలితాలు రావటం, నేను తప్పటం, నా ఆశ అడుగంటటం, నా ప్రోగ్రాములన్నీ పటాపంచలు గావటం, హిందీకి స్వస్తి చెప్పటం, హరనాథ శిష్యత్వంనుండి తప్పుకోటం అన్నీ జరిగాయి ఒక్కసారిగా. మళ్లీ పరీక్షకి జాగ్రతతో చదువుతున్నా లెండి యీమాటు పూర్తిగా దేవుణ్ణే ప్యాసు చెయమనకుండా.

ఈమధ్యలో ఒకతమాషా జరిగింది. ఒక రోజున మధ్యాన్నం, యింకా అన్నం వండకపోతే, కూచొని పహలీ పుస్తకంలో మూడో పాఠం చూస్తున్నా. యింతలో బయట వసారాలోకి ఎవరో వచ్చి "మహా రాజ్, మహారాజ్" అంటున్నట్లు వినబడింది. నేను అక్కడే కూచున్నా కదలకుండా. యింతలో మాఅమ్మ ఎవరో వచ్చారంటూ

వసారలోకి వెళ్ళగానే వాడెవరో మొదలెట్టాడు సోది హిందీలో. "ఓహో యిదంతా ఏదో హిందూస్తానీ గోల! ఏమిటో చూడ్రా అబ్బాయి" అంటూ నన్ను పురమాయించి వెళ్లింది. నన్ను చూడంగానే "రాం రాం" అంటూ దండంపెట్టి, మళ్లీ దణ్ణం పెట్టించుకుని, మొదలెట్టాడు చెప్పటం హిందీలో ఏమిటేమిటో. ఒక అయిదు నిమిషాలు గుక్క తిప్పుకోకండా కొట్టాడు, నేను "మాలుంనై" అని కొట్టుకుంటున్నా. కాని చివరికి వినగా వినగా కొంచెం తెలిసినట్టయింది వాని విషయం. అచ్చ తెనుగులో చెప్పాలొస్తే అతనొక బిచ్చగాడన్నమాట. కాని అతని ఆ తెల్లనిలాగూ, ఆతమాషా ఐన చొక్కా, కోటూ, అతలటోపీ చూచి ఎవరో అనుకున్నాను. అతను చెప్పినదాన్లో అక్కడక్కడ నాకు తెలిసిన నాలుగు ముక్కల్లోనే అతని కథంతా తెలిసింది. అతనిది కాబూలట. "క్షత్రీ క్షత్రీ" అన్నాడు, గనక క్షత్రియుడై వుండాలి. రామేశ్వరం యాత్ర పోతున్నట్టూను, రైలుస్టేషన్ సమీపంలో వున్న సత్రంలో ఉన్నట్టూ చెప్పాడు. 'చార్ ఆద్మీ' అన్నట్టున్నాడు. కాని తరవాత చెప్పిన లెక్కతో నిజం తేలిపోయింది. నలుగురు మనుషులట; తానూ, తన అమ్మా, భార్యా, ఒక పిల్లవాడూ, అని చెప్పటం వల్ల సరిపోయింది—యింకా ఏమిటో నాకు తెలీంది కానా చెప్పి ఏమన్నా యిమ్మన్నట్టుగా చేతులు చాపాడు. అప్పుడు బోధపడింది, అడుక్కుంటున్నాడని, కాని ఎందుకని అల్లా బిచ్చం ఎత్తాల్సి వచ్చిందో బోధపడలా. అడుగుదామా అంటే ఎట్లా? కాశ్సేపు చూచిచూచి, "ధర్మ్, ధర్మ్ బాబూ" అన్నాడు. యింకా ఏమిటో. ధర్మంగదా అనుకోని, "బియ్యం యిమ్మంటావా? బియ్యం, బియ్యం?......అంటే రైసు?" అన్నా తెలుగుతోనే. అర్థమయిందిగాబోలు, "బియ్యంనై బాబూ, హాంరోటీవాలా, రోటీవాలా," అంటూ సాగించాడు. "మరి ఏంకావాలి?" అన్నా ప్రశ్నార్థంగా పిడికిలితో చూ వు తూ. "ధర్మ్, ధర్మ్, ఏక్ కానీ, దో కానీ...." అన్నాడు. కాన్లుగావాలిట బాబూ! నాదగ్గిర కానులు లేవే? అని ఆలోచిస్తుంటే 'ఒఖ్ఖకానీ అయినా సరే చాల'న్నట్లుగా చెప్పాడు. 'సరే, బాగానేవుంది లెమ్మ'ను కొని లోపలికిపోయి పర్సులో చూస్తే ఒక మంచి అణా, ఒక పడని బేడా ఉన్నయి. యిది మరీ బాగుంది. పోనీలే, వాడొఖ్ఖకానే చాలంటూన్నాడు, చాలాసేపు నిలబెట్టానుగదా, యింకొఖ్ఖ కానీ యిద్దాం అనుకుని అణా తీసుకువెళ్లి, అర్ధణా యిమ్మని అడగాలిగా? అందుకని నే చదువుకున్న బాలబోధిని అంతా జ్ఞాపకం చేసుకున్నా ఎక్కడా అల్లాటి వాక్యం జ్ఞప్తికి రాలా. పోనీలే రాకపోతేనని, వానికి అణా చూపించి, "దో కాని హైంజీ?" అని ప్రశ్న అడిగే గొంతులో అడిగా. టక్కున జేబులోనించి రెండుకాన్లు తీసిచ్చాడు; 'అచ్ఛా', అన్నా. నాకు యింకో పాడిముక్క వొచ్చునని చూపుతూ. అణా కాస్తా చేతులో వేసుకుని చక్కా పోయాడు.

## గాంధీజీ మాతృదేవి

# పుత్లీబాయి

మహాపురుషులను కని, పెంచిన వీరమాతల చరిత్రలు జాతికి అమూల్య నిధి పేటికలు. వారి ఒరవడుల ననుసరించి ప్రతిమాతయు, తన సంతానమునకు, దేశభక్తి, దైవభక్తి, ధీరత, స్వాతంత్ర్యభావముల నుగ్గుపాలతో గరపి, వారు మహోత్తములగునట్లు యత్నించవలయును. మహాపురుషులగుటకు జన్మాంతర సంస్కారము కొంత కారణమైనను, తల్లిదండ్రుల సాంగత్యము, శిక్షణ, ఉత్తమవాతావరణములు, ముఖ్యకారణములు కాగలవు. అందును పసివారికి మాతృశిక్ష యధిక ముఖ్యమనియు, మాతృవిద్యాలయమును మించిన విశ్వవిద్యాలయము లేదనియు, చాలమంది యంగీకరించియే యున్నారు. మహాపురుషులను, కని, పెంచి, లాలించు భాగ్యము వడయుటకు తల్లిదండ్రులుతపస్వులు కావలయుట నిక్కము.

పరమాత్మను పుత్రునిగా గోరిన యాదిదంపతులగు పృశ్ని, సుతపులు 12 వేల దివ్యవర్షములు, బ్రహ్మచారులై, యాకలములు దిని, తపమొనర్చి, తమ యీప్సితము సాధించిరని భాగవతపురాణము వాకొనుచున్నది. లోకైక వీరత్వము, అందాల కపురూపమైన వినయసౌజన్యము, పితాజ్ఞాపాలనము, సత్యదీక్ష, ఏకపత్నీవ్రత నిర్వహణము, ఆదర్శ రాజ్యపాలనము తన యందు మూర్తీభవించిన, జాతిమత వివక్షత లేకుండ భారతీయకోట్లకు నిత్యారాధ్య దైవమైన శ్రీరామచంద్రమూర్తిని పసవించిన వీరమాత, అగణిత రాజ్యవైభవముల నోలలాడుచున్నను, గుణభూషణములనే ధరించిన నియమశీల, కౌసల్యామహాదేవి శీలమును, నియమపరతను వాల్మీకి మహాకవి యిట్లు మధురగాన మొనర్చియున్నాడు.

"సీ. సుతహితార్థంబుగ సతిభక్తి శ్రీవిష్ణు
పూజ గావించెడి పుణ్యశీల
వెలివలిపముగట్టి వెలమి విధ్యుక్తంబు
వ్రతపరాయణరైన పరమసాధ్వి
మంత్రపూతంబుగ మంగళాకలితరై
యగ్ని వేల్చుచున్న యమలచరిత
నిష్ఠల గృశియించి, నిజదైవతము నీట
దన్పుచునున్న కాంతామతల్లి."

(ఆంధ్ర వాల్మీకిరామాయణము)

విష్ణ్వారాధనము, జపహోమములు, దానధర్మములామెకు నిత్యకృత్యములై యుండెను. తన్నాశ్రయించినవారికి దానధర్మముల క్రింద నా మహాసాధ్వి 10 వేల గ్రామములను ధారపోసినదన, నిక నామె వితరణము నెంతని చెప్పగలము? లోకులందరివలె పుత్రుని తన్నుద్ధరించుటకు గాక, లోకము నుద్ధరించుటకే కాంచితినను నిశ్చయము కలదగుటవల్లనే, యీ యిల్లాలు, శ్రీరాముని కర్తవ్యపాలనమున కనుమతించి, దుర్భరమైన ఏకపుత్ర వియోగమును 14 ఏండ్లు భరించెను.

ఆంధ్రవరకిశోరము బాలచంద్రుని మాత, ఐతాంబ చెప్పినట్లు "వీరపత్నులకును, వీరమాతలకును సుఖమేమిలేదు." ఎప్పుడును వారికి కత్తితోడి సామే. ఎల్లప్పుడును వారు లోకకల్యాణముకొరకై తమ యనుంగుల యిక్కట్టులకును, కడకు మరణమునకును సిద్ధపడి ధీరలై యుండవలసినదే! ఈ స్థితి రణరంగమున పోరాడుటకంటె తక్కువ కాదు.



బళ్లారిమండల విద్యావిషయక ప్రదర్శనముల సందర్భమున 'ఆనెగొందిపతన' మను ఆంధ్ర నాటకము నత్యంత సంస్తవనీయముగ ప్రదర్శించిన బళ్లారి రాజకీయోన్నత బాలికాపాఠశాలా విద్యార్థినులు. కుర్చీలలో గూర్చుండియున్న బాలిక లిరువురిలో చంద్రశేఖర రాయల భూమిక నిర్వహించిన బి. పార్వతి అను (మూడవఫారము) విద్యార్థినియు, ఆర్యాదేవి భూమికను ధరించిన డి. లక్ష్మీనారాయణమ్మ యను (నాలుగవఫారము) విద్యార్థినియు రజితపతకములచే బహూకరింపబడిరి.



బంతి భోజనాలు

మతకర్తయగు బ్రహ్మానంద కేశవ చంద్రసేనుని మాతృదేవి యాతని ధార్మికతకు, తీవ్రనిశ్చయమునకు మతప్రచారమునకు ఎటుల తోడ్పడెనో లోకద 'గృహలక్ష్మి' పాఠకు లెరిగియే యున్నారు.

ఈ వ్యాసమునకు వస్తువు భారతాంబ గర్భశుక్తి ముక్తామణియై జన్మించి, ఆసేతు హిమాచల పృథ్వికిని మకుటరహిత సార్వభౌముడై ఆర్థిక రాజకీయ నైతిక దాస్యములనుండి తప్పించి భారతీయులను సత్యాహింసా మార్గముల నేమరక నడపుచు నేడు భారతవర్షమునకే గాక ప్రపంచాకాశమున దినమణియై వెలుగుచు ఉన్నత హిమాలయశిఖరమునుండి లోకశాంతికి అహింసాచరణ శంఖారావ మొనర్చుచున్న లోకోత్తరపురుషుడు గాంధీజీ పూజ్యమాత పుత్లీబాయి.

ఈయమ తల్లిదండ్రులనుగూర్చి గాని బాల్యమును గూర్చిగాని వివరములు దొరకలేదు. ఈయమను గాంధీజీ జనకుడు కబాగాంధి నాల్గవకళత్రముగా పెండ్లాడెను. వీరికి ఒక కుమార్తెయు మూవురు కుమారులును జన్మించిరి. వీరిలో కడగొట్టుబిడ్డయే లోకపూజ్యుడగు మోహనదాసు కరంచందు గాంధీ. జన్మము పోరుబందరులో 1869 సం॥ అక్టోబరు 2 తేదీ, శుక్ల సం॥ భాద్రపద బహుళద్వాదశి.

పుత్లీబాయి పరమసాధ్వి. దైవభక్తి యామెకు మిక్కుటము. అనుదినమును విష్ణ్వాలయమున కేగుట యామెకు నిత్యవిధి. నిత్యము పూజచేయనిది యామె భుజించి యెరుగదట. కఠినములగునోముల నెన్నిటినో యామె నోచెను. ప్రతివత్సరమామె చాతుర్మాస్య వ్రతమును దీక్షగా జరిపెడిది. (వర్షకాలము నాల్గు మాసములు నొంటిపూట భుజించుట) ఇంతేగాక, చాతుర్మాస్యలలో రోజువిడిచిరోజు భుజించుటయు, చాంద్రాయణవ్రతము సైతమామె యవలంబించెను. (చంద్రుని హాని వృద్ధులనుబట్టి కబళమును హెచ్చింపు తగ్గింపుచేయు వ్రతము) మరియు వరుస వెంబడి రెండు మూడు యుపవాసముల నామె యవలీలగా చేయుచుండెను. జబ్బుపైకి మామె దీక్షను వదలించ జాలక పోయెడిది. ఒక చాతుర్మాస్యవ్రతమామె తీవ్రమగు జబ్బులోనుండియు యథావిధిగా నడపెను.

ఈ దీక్షలుచాలక యిమ్మహాసాధ్వి చాతుర్మాస్యలలో సూర్య దర్శనములేనిది భుజించనను దీక్షను సైతము బూనెను. మహాత్ముల కసాధ్యమెయ్యది? ఈదీక్షను బరీక్షించుటకోయన, సూర్యుడొక్కొకసారి వరుసగా రెండుదినములవరకు మేఘమండలమునుండి వెలికివచ్చెడివాడుకాడు. తల్లియెడ నపరిమితప్రేమ గల గాంధీ సోదరులు, ఆటలాడుచున్నను, సూర్యుని పైనకే కన్నుంచి, కొంచెము వెలుతురు కనబడగానే, తల్లికడకు బరువెత్తి "అమ్మా తొందరగా రావే! సూర్యుడు వచ్చాడని" పిలుచుచుండిరి. ఆమె పనుల నుండి వచ్చునరికి సూర్యుడు మబ్బుల మాటునకు బోవ యామె యావంతయు కుందక, మందస్మిత మొనర్చుచు "నేడు నేను భుజించు టీశ్వరునకు సమ్మతము కాదు కాబోలు" ననుచు లోనికిబోయి పనులు చూచుకొనెడిది.

ఇట్టి పరమ దైవభక్తి పరాయణ, యతి నియమ వ్రతశీలకు పుత్రుడై, యామె పూతరక్తము తనలో ప్రవహించుచు, యామెశీలము లేతవయసున హృదయమునందు పాలకుడగుటయు, గాంధి లోకభీకరములగు నుపవాసముల నొనర్ప గలుగుటయు, భగవద్వాణిని విన గల భక్తశిఖామణి యగుటయు దటస్థించినదని, మనము సులభముగా గ్రహించగలము. ఆయన పట్టణమున నున్నను, బల్లెనున్నను, కొండనున్నను, లోయనున్నను, యింటనున్నను, బయటనున్నను, చివరకు రైలుబ్రయాణ మొనర్చుచున్నను, ప్రతిరోజును, ఉదయ సాయంసమయములందు క్రమము దప్పక ప్రార్థన లెట్లు జరుపుచున్నదియు, రోజుకు 200 గజముల నూలువడుకనిది నిద్రించనను దన దీక్షను, ఊపి రాడని కాంగ్రెసు సభాదినములలో రాత్రి రెండుగం

టలకైనను వడికి పరుండుటయు, లోకవిఖ్యాతమైన 21 దినముల యుపవాసములో పరుండిసైతమెట్లు రాట్నము వడికినదియు, భారతసోదర, సోదరీమణు లెల్లరకును, లోకమునకును విదితమే. ఇక జెయిలులో సైత మీ దీక్షలను సాగించెనని చెప్ప బనియే లేదు గదా!

పుత్తలీబాయి ఆధునికమగు విద్య నెఱుగదు. కాని యీమెకు లోకపరిజ్ఞానము మెండు. సంస్థాన వ్యవహారము లామెకు బాగుగా దెలియునని, రాజ దివాణమున కామె దరుచు బిడ్డలతో బోయి, రాజ పత్నితో భాషించెడిదని, జనానా వారామె తెలివి తేటలకు మెచ్చుకొనెడివారని గాంధిజీ వ్రాసి యున్నారు.

ఇచట గాంధిజీతండ్రి కబాగాంధీ లేక కరంచంద గాంధీనిగూర్చియు, వారి పూర్వులనుగూర్చియు కొంచెము తెలుపుట యుక్తము. ఈయనతండ్రి తాతలు మాపురును, కతియవారునందు దివానులుగా బనిచేసిరి. (వీరు వైశ్యులను సంగతి ఎల్లరెరిగినదే. గాంధీ వంశీకులు తొలుత పచారు దినుసు అమ్ము వర్తకులు. క్రమముగా తమ ప్రతిభావిశేషమువల్ల, రాజకోట సంస్థానమున ముఖ్య రాజకీయోద్యోగులైరి.) ఈయనయు, యీయన తదనంతర మీయన సోదరుడు తులసీదాసు గాంధీయు, రాజకోట సంస్థానమున మంత్రిపదవిని నిర్వర్తించిరి. వీరందరును, ఆత్మగౌరవమును దీక్షతో రచించికొనిరి. ఈయనతండ్రి ఓతాగాంధీ కొన్ని కుట్రల వల్ల కథియవారును విడచి యొక నవాబు నాశ్రయించ వలసినప్పుడు కుడిచేతిని వెనుకకు మడచిపెట్టి, ఎడమ చేతితో సలామొనర్చెనట. ఈ ప్రత్యక్ష యగౌరవ మునకు కారణమేమని నవాబడుగగా, కుడిచేయి కథియ వారునకు యిదివరకే యమ్ముడు పోవుటచే, స్వాధీనము లేదని చెప్పెనట.

కరంచంద గాంధీగారికి అక్షరజ్ఞానము చాల తక్కువ; కాని లోకజ్ఞానముమిక్కుటమగుటచే, యీయన వేలకొలది జనుల నేలగలిగెడివారు. ఇంతేగాక, యీయన రాజవంశీయుల తగవులనుసైతము దీర్చుచుండెను. పెక్కు చిక్కు సమస్యల నీయన యవలీలగా విడదీయగలుగుచుండెను. ఈయన సత్యప్రియుడు, నిష్కపటి. లంచంగొండితన మెరుగడు. ఇంటను బయటనుగూడ సమానముగా న్యాయమొనర్చెడివాడు. శూరుడు. ఈయనకు కులాభిమానము మెండుగా నుండెను.

సంస్థానముపై నీయన కపరిమితాభిమానము. సంస్థానాధిపతిని తూలనాడెనని, యీయన పొలిటికలు ఏజంటగు నాంగ్లేయుని దూషించెను. దానిపై నతడు కినిసి "ఇందులకు పశ్చాత్తాపము దెలుపుదువా, లేక చెరనుందువా" యని బెదరించెను. ఆత్మగౌరవ సంపన్నుడగు గాంధీ చెరనుండుటకే యంగీకరించెను. గాని యవినీతికి లోబడలేదు. పిమ్మట నా యాంగ్లేయుడే పశ్చాత్తాపపడి యీయనను విడిచిపుచ్చెను. ఈయన నాడు చూపిన యాత్మగౌరవము మన గాంధిజీయం దెన్నివేల రెట్లుగా పెంపొందెనో మన మెరుగుదుము. డబ్బు నిలవచేయుటకు కబాగాంధీ యెన్నడును యత్నించలేదు.

అయితే తన జనకునియందు కొంత లౌల్యత కల దని యందువనే యీయన నాల్గుసారులు వివాహ మాడెనని గాంధిజీ వ్రాసినారు. వీరు ప్రథమ, ద్వితీయ కళత్రముల కొక్కొక కూతురును, కడపటి భార్యకు పైనదెలిపిన నలుగురు బిడ్డలును కలిగిరి. బిడ్డల నీయన యెన్నడును కొట్టి యెరుగరట. ఒకనాడు గాంధిజీ తప్పొనర్చి యందులకు బశ్చాత్తప్తుడై యికముందట్టి పనిచేయనని ప్రతిజ్ఞవట్టి, యీసంగతి నంతను చీటిపై వ్రాసి, గడగడ వణకుచు తండ్రికందిచ్చెను. అసమయ నాయన భగందరముచే బాధపడుచు మంచము పట్టి యుండెను. చీటి చదువుటకు లేవబోయి, పిమ్మట యణచుకొని, పరుండియే చదివి, ముత్యములవంటి కన్నీటి బిందువులతో నాచీటిని దడిపి, చివరకు

# గాంధీజీ మాతృదేవి పుత్లీబాయి

దానిని చింపి పారవేసెనట. ఆసమయమున నాయనకు కలిగిన తలపు లెట్టివోగదా? ఇకమరి తిట్టుటగాని, కొట్టుటగాని చేయలేదు. తండ్రి కన్నీటిని గాంచి, గాంధీజీ కూడ కన్నీరు దెచ్చుకొని, యీ పావనోదకముతో పాపప్రక్షాళనమొనర్చి, యీవిషయము తనకు అహింసయందు మొదటి పాఠమయ్యెనని వ్రాయుచున్నారు. అప్పటినుండి కరంచంద గాంధీగారికి పుత్రునిగూర్చి భీతిపోయి, వాత్సల్య మినుమడించెను. చివర దినములలోనాయన వాంకనేరులో దివానుగా నుండి ఫించను దీసికొనెను.

ఈయనకు మతతత్పరత హెచ్చు. అనుదినమును పూజ యొనర్చెడివాడు. (వీరి వంశజాలు పరమవైష్ణవులు. ఆరాధనకొరకు వీరికి ప్రత్యేక దేవాలయము లుండెడివి.) అంత్యకాలమున గీతాపారాయణ మీయన కభిమతమైయుండెను.

ఇక గాంధిజీ జీవితమున ముఖ్యమైన మార్పు గావించి యాయన జీవితమంతటికి మెరపుతీగయైన శపథమునుగూర్చి తెలిసికొందము. ఆశపథమే లేని యెడల గాంధిజీ జీవితమే యెండమావులబట్టి పోయెడిదో, ఇప్పటి భారతవర్ష చారిత్ర మేవిధముగ నుండెడిదో యూహించుట దుస్తరము.

ఈ శపథమునకు కారణభూతురాలు గాంధిజీ మాతృమూర్తి పుత్లీబాయి. గాంధిజీ మిత్రులయు, సోదరునియొక్కయు ప్రోత్సాహమువల్ల బారిష్టరు పరీక్షకొరకింగ్లాండునకు బోవ నుత్సహించెను. అందులకు తల్లి యనుమతి నీడెను. కాని శుద్ధహైందవ వాతావరణమునయున్న యామె యందుల కెట్లంగీకరించగలదు? సీమకు బోయినవారు మధు మాంసములతోను, మదవతులతోను పొత్తులేకుండ నుండరని, మతభ్రష్టులు కాక రారని యామె భయపడెను. ఇతరులకంటె విలక్షణముగా కాన్పించు తనపట్టి లోకోద్ధరణకు గాక, పతితుడగుట కామె యెట్లంగీకరించగలదు? చూచి చూచి యామె మనసొప్పకుండెను. అయితే గాంధీ నియమనిగ్రహములం దామెకు విశ్వాసము కలదు. సీమ కేగుటయందలి యాతని యౌత్సుక్యము నామె గ్రహించెను. గాన కొంత అయిష్టముతోను, కొంత యిష్టముతోను తమ కుటుంబ హితైషియైన బేచరజీస్వామి యను జైన సాధువు సలహా తీసికొని యీయమ పుత్రునిచే "మద్యము, మాంసము, మహిళలను ముట్ట"నని శపథము చేయించి సీమకు ప్రయాణము చేయించెను.

సీమలోనున్న కాలమున యీ శపథమును నెరవేర్చుటకు యువకుడగు గాంధీజీ యెంత కష్టపడెనో, ఆయన యాత్మకథను చదివినవారందరికి వేద్యమే. ఎటులైననేమి? అరణ్యమునకేగు శ్రీరామునకు కౌసల్యా సాధ్వి కట్టిన ధర్మరక్షవలెనే యీయమ కట్టిన కంకణమువల్ల గాంధిజీ సీమయందలి వ్యామోహములనన్నిటి జయించి యద్వితీయముగ శపథపాలన మొనర్చి భారతవర్షమును ప్రవేశించెను. వెంటనే తన యభ్యున్నతికి కారణమైన మాతృదేవి చెంతకేగి యామె పాదములవ్రాల నాతురుడయ్యెను. కాని నాటికి పుత్లీబాయి యీలోకమున లేదు. కృతకృత్యుడై వచ్చిన గాదిలిసుతునిపై నామె యమరధామమునుండియే శుభాశీస్సులను కురిపించెను.

గాంధిజీ విచారమునకు మేరలేదు. నియమపాలనమునకు తాను సీమలోపడ్డ కష్టములన్నిటిని మాతృదేవికి తెలిపి యామె కానందము కలిగించ నెంచెను. కాని యాభాగ్యము కలుగలేదు. పిమ్మట వ్యర్థాశ్రువులు రాల్పక యాధీరసాధ్వికి తగిన పుత్రుడుగా మెలగుటకే కృతనిశ్చయుడయ్యెను. ఆయన యెట్లు కృతార్థుడయ్యెనో లోకమే యెరుగును.

భారతమాతృపుత్రికాసంతానమున కలంకారప్రాయమైన యిట్టి మహిళామతల్లులు మన దేశమున పెక్కురుదయింతురుగాక!

అచంట లక్ష్మీనరసింహం.

# స్త్రీ సమాజములు

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్య దతి సిద్ధతే
యతతా మపిసిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్వతః" గీత.

స్త్రీ సమాజములగూర్చి నాలు గైదు సంవత్సరములనుండియు విదుషీమణులును అనుభవశీలురునగు శ్రీమతులు వరలక్ష్మమ్మ మొదలైనవారు వ్రాయుచున్నారు. విశేషించి తగిన శ్రద్ధయు తీసుకుని సాధ్యమయి నంతవఱకు చక్కజేయుచున్నారు.

ఒక్కొక గ్రామమునందు అనేక స్త్రీ సమాజము లుండుటచేత, చందాల నిచ్చుట లేదనియో తమ సమాజములకు గ్రామములోని స్త్రీలు తప్పక వచ్చుటలేదనియో మిష గల్పించుకొని పార్టీలు పెంచి కలహించి అశాంతిజేయుట జరుగుచున్నది.

ప్రస్తుత కాలమున ఆంధ్రదేశముయొక్క ఆర్థిక దుస్థితి యెట్లున్నదో అందరును యెరిగియే యున్నారు. ఇట్టి అవస్థలో చెట్టుపేరు చెప్పి పండ్లు నమ్ముచున్నట్లు, యెవరి పేరననో ధర్మ సంస్థాపనములు చేయుచున్నామనియు మేము ధ్యాన జపములు చేసికొనుటకు ఏర్పాటులు చేసికొనుచున్నామనియు మరియు నేదియో సాకు గల్పించుకొని చందాల నివ్వవలసినదని పేద సాదలను స్త్రీ పురుషులను బలవంతపెట్టియు మోమోట బరచియు, సర్వదా పీడించుచున్నారు. తమ సమాజముల కిచ్చినవారును వచ్చిన వారును పుణ్యాత్ములనియు మిగిలినవారు పితృ పితామహులతో రౌరవాది నరకకూపములకు బోవువారినిగా తలంచు స్త్రీ సమాజము లింకను బయలు దేరుచునే యున్నవి. చందాలకు పీడించుటయేగాని గ్రామములోని స్త్రీలకును బాలికలకును చేతిపనులకుగాని విద్యావిషయమునకును గాని ఉపయోగింపక ఆక్రమించిన వారియొక్క బలపరాక్రమములకు లొంగియున్న యీ స్త్రీ సమాజములవారు శారదానికేతనములును సేవాసదనములు తమ చందాలతో పోల్చుకొని యేదేని ఒక గొప్ప కార్యము పలపెట్టినప్పుడు చందాలు లేనిదే యెట్లు నెరవేరుననుచున్నారు. శారదానికేతనములును సేవాసదనములునువలె నీ సమాజములు విద్యాసంస్థలు కావు. కార్మిక సంస్థలును కావు. అట్టి సంస్థానముననే వీనిని నిర్మించిన యెడల దేశమునకు క్షేమమే యగును. సమాజ కార్యమువలె నెన్నటికైన సాగనియప్పుడు దేశజనుల ద్రవ్యమును వెచ్చించి నిర్మించిన యీ సమాజములను తమవారి యిష్టమువచ్చిన ధర్మముల కుపయోగింపవచ్చుననుటలో ఏమి త్యాగమున్నది? ఇట్టి సమాజములవారికి లోక దీక్ష గలదు. రేయుంబవళ్లు మోక్షసాధనములైన జ్ఞావాశిష్ఠాదుల శ్రవణముచేతనే ముక్తి కరస్థగతమగుననియు తక్కిన వార్తలుగాని పత్రికలుగాని దేశ పరిస్థితులుగాని మరెవ్వరి అభిప్రాయములుగాని వారి కవస

రము కాదని. కావున మన వ్రాతలు వారి అభిప్రాయముల నెంతమాత్రము మార్పు చేయజాలవు. వారుచూడరు, వినరు. పూవుల చేతఁ నిప్పు చల్లార జాలదు.

అందుచేత నీవిషయమును మన మహిళా సంఘము వారొక తీర్మానముగాజేసి ఒక సంఘము నేర్పాటుజేయించి యీ స్త్రీసమాజములపై తనిఖీ చేయించుచు ప్రజలపై వసూలుచేసిన ద్రవ్యముతో గ్రామములోని బాలికలకును స్త్రీలకును హిందీ తెలుఁగు సంస్కృతమును బోధించునట్లును, రాట్నము కుట్టు మొదలైన చేతిపనులు నేర్పించునట్లును, మిగిలిన కాలములో వారి ధ్యానజపములు భజన పారాయణములును చేయుచు, పురాణ శ్రవణము వారికెట్టి ఆవశ్యమో పుస్తక భాండాగారముకూడా నంత ఆవశ్యకమేయని చెప్పి, ప్రతి గ్రామమును తనిఖీచేయించి, ప్రతి సమాజమునకును సమర్థతగల విద్యావతుల కొందరిని కమిటీగా నేర్పరచి, నెలకొక పర్యాయము కమిటీ మీటింగును సంవత్సరమున కొక పర్యాయము బడ్జెటు చూచుటయును మొదలైనవి నడిపించుటకై మన ఆంధ్ర స్త్రీలోకమును ప్రార్థించుచున్నాను. ఇప్పటికే యీ సమాజములగతి మిటిమీరిపోయినది. యీ విపరీతములు వెంటనే నిర్మూలింపబడనిచో దేశమునం కెన్ని విధముల నష్టమో తెలియజాలము. మహిళా సంఘమువారీ విషయమున శ్రద్ధవహించి సమర్థతగల స్త్రీ సూపర్వైజరులను బంపించి దేశోపకార సంస్థలుగా జేయించెదరని నమ్ముచున్నాను.

# "నా దీవెనల్"

చి॥ సౌ॥ సోదరి విమలకు—

'జీవన ప్రభాత' (నవకళాసమితి)

నీగళ సూత్రమే—నీకిచ్చు విభవముల్,
నీప్రేమ బంధమే—నీకిచ్చు మంగళం.
సంసార రంగాన
సారమౌ లోకాన,
ఆడుచును జీవిని
ఆదరిని జేర్చుమ !
నీప్రేమ బంధమే—నీగళ బంధమౌ,
నీ సచ్ఛీలమే—నీనుదుటి కుంకుమౌ.
పసుపు కుంకుమలుండు
పచ్చన్ని యింటిలో
పాడిగల కొంపలో
పాడుచు నుండుమ !
నీ సౌశీల్యమే—నీకీర్తి చంద్రికల్,
నీవిమల మూర్తియే—నీయింటి దీపమౌ
అందాల రాణివై
అందరికి దేవివై
రమణీ మణులకు
రాణివై వర్ధిల్లు !
నీశీల సంపదలు—నీ దైవసములు,
నీపతి సేవలే—నిత్య కళ్యాణాలు.
ప్రేమ సామ్రాజ్యాన
ప్రీతి విహరించుమ !
ప్రియ సుహృదయాన
ప్రేమ నధిష్టింపుమ !
నీకివియె దీవెనల్—నీకిదియె మంగళం
నీప్రేమ బంధమే—నీకిచ్చు విభవముల్.

# కోడలు

శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

"వెంకమ్మగారు! మీ అబ్బాయికి సంబంధం కుదిరిందా?"

"కుదరటానికి యెవరు ఆలోచిస్తున్నారు? ఎక్కడి కన్నా వెళ్లి కనుక్కుంటే గౌరవంగా ఉండదంటారు మా పంతులుగారు. ఆడదాన్ని నేనేం చేస్తాను సుబ్బమ్మొదినా?"

"నిజమే ఆయనగారు అనేమాట మంచిదే. ఆడపిల్ల నిచ్చేవాళ్లు మనింటికి రావాలి గాని మనం వాళ్లింటికి వెళ్లితే బెట్టుగా ఉండదు."

"మనం బెట్టుగా కూర్చుంటే మనింటికి తీసుకొచ్చి ఎవరిస్తారు పిల్లను? మా ఎస్టేట్లు చూచివస్తారా? మనబ్బాయి బి.ఏ. చూచివస్తారా? చెప్పు సుబ్బమ్మా?"

"అదీ నిజమే వెంకమ్మగారు. కొంచం ఆలోచించకుండా పెళ్లిళ్లు యెల్లా అవుతాయి మనబోటి సంసారాల్లో—"

"మీ వాళ్లల్లో యెవరన్నా పిల్ల ఉంటే కుదుర్చు సుబ్బమ్మొదినా నీక్కూడా పుణ్య ఉంటుంది."

"అయితే వెంకమ్మగారు! మీ అబ్బాయి యెంత జీతంలో ఉన్నాడు?"

"సుబ్బమ్మా! నాతో చమత్కారమా నీకు? జీతమేమిటి యెల్లాగో వాడికి రెండుపోగులేస్తే కంటితో చూద్దామని ఉన్నది నాకు. అంతేగాని జీతం పెట్టగల ఆస్తులు ఉద్యోగాలు ఏమున్నాయి మనకు?"

"చమత్కారం కాదు వదినా. మగపిల్లలు కల వాళ్ల పద్ధతులు ఇవ్వుడు అవ్వే గనుక అడిగాను."

"కొడుక్కు పెండ్లి కాదనా నీ తొందర? కాగానే అవుతుంది. నీవు అత్తగారివౌతావు. కోడలొస్తే మాతో పలుకుతావా?"

"అంత రోజు రానివ్వు నీ నోటినిండా పంచదార పోస్తాను."

"ఇంత కష్టపడి కుదిరిస్తే ఇంతేనా నాకు?"

"పప్పూ లేవు బియ్యం లేవు పలగం పులగం అన్నట్లు పిల్ల కనిపించలేదు నాతో హాస్యము నీకు."

"పిల్ల ఉన్నదిలే చెప్పు మీ అభిప్రాయం నిజంగా."

"నిజమేనా సుబ్బమ్మా?"

"నీతో అబద్ధమాడుతానా?"

"యెవరిపిల్ల?"

"మా చెల్లెలి మఱిదికూతురు. పదేండ్లపిల్ల చక్కగా ఉంటుంది. చదువు సంగీతములన్నీ నేర్చుకుంటున్నది. మఱిదంటే పిన్నత్తగారి కొడుకు."

"యెవరైతే మనకెందుకు? మన కనుకూలమైతే సరి. నీ ధర్మమా అని వాడు ఒకయింటివాడైతే నిన్ను తలుచుకుంటాడు."

"సరే మీవాళ్లతో ఆలోచించు. అవక మా వాళ్ని పంపుతాను వదినా!" అని మలుపుతిరిగి అవతల వీధికి వెళ్లింది సుబ్బమ్మ బిందె బుజాన పెట్టుకొని.

సుబ్బమ్మగారి దగ్గర సెలవుతీసుకొని యింటికి చేరింది వెంకమ్మగారుకూడా నీళ్లాట రేవునుంచి.

౨

చెఱువుకు బట్టలు ఉతకటానికి వెళ్లిన వెంకమ్మగారికి ఆ రోజు ఒక సుదినం అనిపించింది. సుబ్బమ్మగారు తన కొమారుడి పెండ్లి విషయమైన సంగతులు చెప్పగానే ఆమెకు పరమసంతోషం కలిగింది. ఇంటికి రాగానే బిందె పడమటింట్లో దింపి తడిబట్టలు దొడ్లో రోటిమీద పెట్టి, ఈకబుర్లు యెప్పుడు భర్తతో చెప్పుదునా అనే ఆదుర్దాతో వచ్చింది తూర్పు వసారాలోకి.

పొదరొండలో తాటాకుల చాపమీదకూర్చుని విస్తళ్లు కుట్టుకుంటున్నాడు మారమ్మగారి భర్తపానకాలుగారు. తడివస్త్రముతో భార్య రాకచూచి "తడి గుడ్డలో పెత్తనాలేమిటి?" అన్నాడు కొంచం కోపంగా.

"పెత్తనాలు కాదు ఇవ్వాళ చెరువుదగ్గిర కామయ్యగారి భార్య సుబ్బమ్మ కనిపించి చెప్పింది; వాళ్ల బంధువులపిల్ల రెవరో ఉన్నదిట మనబ్బాయి కిప్పిస్తానని."

"సరే మంచిదే మాట్లాడుదాం."

"మధ్యాహ్నం మనింటికి వారే వస్తారట."

"సరే వస్తే మాట్లాడుకుని శుభమస్తూ అనుకుందాం. త్వరగా వంటకానీ. ఇవ్వాళ పడమటిపొలం కోత కోస్తారుట వెళ్లి చూసి రావాలి."

"ఎంతసేపవుతుంది లెండి" అని ఇంట్లోకి వెళ్లింది వెంకమ్మ.

లోవర సెకండరీ పరీక్షఅయి హాయ్యరు ట్రైనింగు ప్యాసయి, దగ్గిరపల్లెటూళ్లో అక్టింగుగా పనిచేస్తున్నాడు, వెంకమ్మగారి కొమారుడు. శలవులకు ఇంటికొచ్చి ఇక్కడే ఉన్నాడు. తన వివాహవిషయంలో తల్లిదండ్రీ సంభాషణ వింటూ తడికల గదిలో పడుకున్నాడు.

3

పానకాలుగారు పూర్వకాలం మనిషైనప్పటికీ ముందాలోచన మరియాద కలవాడు. తెలివి కలవాడు చమత్కారికూడాను. తనకున్న అరు యెకరముల పొలము స్వంతాన వ్యవసాయం చేయించుకుంటూ, అప్పూసొప్పూ లేకుండా జీవనం చేస్తున్నాడు.

మధ్యాహ్నం రెండుగంటలైంది. పానకాలుగారు భోజనము చేసి నిద్రపోయిలేచి, ఇంతలో భార్య చెప్పిన మాట జ్ఞాపకం వచ్చి వీధిగుమ్మం వంక చూస్తున్నారు. ఇంతలో సుబ్బమ్మగారి భర్త కామయ్యగారు వారి బంధువులు రావడం చూచి ఓహో బావగారు! అని స్వాగతం యిచ్చి యింట్లోకి తీసుకొచ్చారు పానకాలుగారు.

ఆహ్వానం అందుకుని అందరు వచ్చి చాపలమీద కూర్చున్నారు.

"ఏమండి పానకాలు బావగారు! వీరు మా వదినగారి తమ్ముడు. వీర్ని ఇదివరకు చూచారా? వారు వీరి బావమరిదిగారు," అని అందర్ని ఎరుక పరచారు కామయ్యగారు పానకాలుగారికి.

"మీ వదినగారిని ఎరుగుదునుగాని వీర్ని ఎరుగనండీ" అన్నాడు పానకాలు.

"వీరి కుమార్తెను మీ కుమారుడికి ఇవ్వవలెనని వచ్చారు."

"శుభం అభ్యంతర మేమున్నదీ?"

"అయితే? మీ కుమారుణ్ణి యే మాత్రం కిమ్మతు చేశారో అదికూడా శలవియ్యండి" అని నవ్వాడు కామయ్యగారు.

"బావగారూ! యేం కిమ్మతు చేసినా తమరే వెయ్యాలి నలుగురికొమార్ల వివాహాలు చేశారు గనుక" అన్నాడు పానకాలుగారు చిరునవ్వుతో.

"సరే ఏమిటి మీ అభిప్రాయం తెల్పండి?" అన్నాడు కామయ్యగారు.

"నా దేముందండీ బావగారు! మీ అభిప్రాయమే నా అభిప్రాయం మీరే చెప్పండి?"

"వారు వెండిచెంబు వెండిగిన్నె వెండికంచము పట్టుపంచలు ఇస్తారట మీ కిష్టమా? అయిష్టమా? చెప్పండి."

"సరే ఇష్టమేగాని పిల్లవాడు కోరుకున్నాడు."

"సరే చెప్పండి. భరించకలిగితే భరిస్తారు లేకపోతే వెళ్లుతారు."

"ఉంగరము, సైకిలు, చేతిగడియారము కావా లంటున్నాడు. ఏమి గొప్పవి కోర్లేదులెండి వాడైనా. నేనేమి డబ్బు కాసపడేవాణ్ణి కాదు గదా? యేవి ఇచ్చుగున్నా మీ అల్లుడి ముచ్చటకే."

'యేమంటారు' అన్నట్లు కన్యాదాత వంక చూశాడు కామయ్య. 'సరే' నన్నట్లుగా తలవూపాడు కన్యాదాత.

"సరే తాంబూలాలు పుచ్చుకోండి" అని జేబులో నుంచి తమలపాకులు తీశారు కామయ్యగారు.

ఇంతలో తలుపుచాటునుంచి వెంకమ్మగారు అన్నది.

"కామయ్య అన్నగారు ఆడపిల్లల సంగతికూడా అనుకోవాలి."

"ఏమిటండీ వెంకమ్మగారు ఆడపిల్లలకు అంటే? వాకేమి ధరించలేరు ఏమంటారు మీరు?"

"ఏమి లేదండి. ఆడపిల్ల లిద్దరికి చెరొక పాతిక రొక్కము, బొట్టుపెట్టెలు వైగయిరా సామాను అందరికి తెలిసినదే కదా? వాళ్ళకుమటుకు ముచ్చటెల్లా జరుగుతుంది? ఈ వక్కడే పిల్లవాడు మాకు."

అందరు వక్కనిముషము నిశ్శబ్దంగా ఉండి తరువాత రొక్కం విషయమై 'మావల్ల కాదు వేడుకలు జరుపుతాం మా శక్తికొలది కానివ్వండి' అన్నారు వచ్చినవారు. సరే నన్నారు పానకాలుగారు.

౪

వెంకమ్మగారి కొడుకుకు పెండ్లై రెండేళ్లైంది. కొడుకు పెండ్లిముందున్న సంతోషము ఉత్సాహము ఇప్పుడులేవు. వియ్యాలవారి పేరుచెబితేనే మనమున చిరచిరగా ఉంటున్నది.

పానకాలుగారికి కొంచం జ్వరంవచ్చి అదేయెక్కువైంది బ్రతికే స్థితికూడా కనిపించలేదు.

ఒకరోజు సాయంకాలం చెరువునుంచివచ్చి ఏదో విసుక్కుంటూ పొయ్యిదగ్గిర కూర్చున్నది వెంకమ్మ.

"ఏమే ఇవ్వాళ నాకు మందుగతికూడా లేనట్లుంది. మళ్లీ యేదో చెందలపెట్టావే విసుక్కుంటం?"

"మీ మీదేవిసుగు నాకు. ఏదో కష్టంగాఉండి అనుకుంటే? మీకెందుకూ?"

"యేమిటి యివ్వాళ మళ్లీ క్రొత్త?"

"ఏమిలేదు ప్రతివాళ్లు పిల్లవాడికి కట్నాలిచ్చి కానుకలిచ్చి పిల్లనిస్తామని వస్తాంటే, మనకెక్కడ దొరికింది ఈ దిక్కుమాలిన సంబంధం? ఆడపిల్లలకు గాని పిల్లవాడికిగాని వక్కముచ్చటైనా జరపలేదు కదా? ఇప్పుడు కరణంగారిభార్య చీవాట్లు పెట్టింది. ఇంకా కొన్నాళ్లుజరిగిన తరువాతైతే యెక్కువ కట్నం ఇచ్చేవాళ్లని."

"నువ్వే కుదిర్చావుగా? ఇంకా అనుకోట మెందుకు?"

"అందుకనే నోరునొక్కుకుని ఊరుకున్నాను."

"అయినా నేనేం కుదిర్చాను? ఆమె చెప్పిన మాటలు చెప్పాను. మీరేగా అంతా కుదుర్చుకున్నది."

"యెవరు కుదిర్చినా నీయిష్టప్రకారమేగా? వద్దనలేక పోయావా?"

"ముందు మనకేం తెలుస్తుంది?"

"ఇంకొకచోటమటుకు ముందు నువ్వేం తెలుసుకుని చేసుగునేదానివి? అయినా వాళ్లేం తక్కువ చేశారు? అనుకున్నప్రకారం అన్నీ ఇచ్చి రత్నంలాటి పిల్లనిచ్చి శక్తికొలది చక్కగా పెండ్లిచేశారు. నువ్వే అన్నింటికి పేచిపెట్టి అలిగి అన్నంతినక, పిల్లకు పెడతా నన్న వస్తువులు చీరలు పెట్టక నానా అగడంచేశావు గాని వాళ్లేంచేశారు?"

"మీ కదొక్కటి కనిపిస్తుంది నేను చేసింది. వాళ్లు వక్కముచ్చటన్నా జరపకపోతే మీకు బాగానే ఉన్నది. సొమ్ము అప్పుడు పెట్టకపోతే యెక్కడికి

పోయింది? యెవరన్నా తీసుకున్నారా? ఇక్కడి కొస్తే అదిదే పెట్టుకుంటుంది. ఇక ముచ్చట్లురావు గాని సొమ్ముకేం చక్కగా పెట్టుక్కులుకుతుంది."

"నీ మొఖమ్మండా! ఇక్కడికొస్తేమటుక్కు దాన్ని పెట్టుకుని అనుభవించనియ్యబోతున్నావా?"

"నన్ను తిట్టటం బాగా తెలిక మాకు. వాళ్ల పన్లు మాక్కనిపించవు. పెండ్లై రెండేళ్లైంది. పక్కమాట న్నా పిల్లవాణ్ణి తీసుగెళ్లారేమెం చూడండి. పిల్లన్నా కాపురానికి వస్తుందేమె అంటే అదీ కనిపించలా. నిసదందినగూడు ఈ ఏడు అందటంలేదు. అమ్మగారి పెట్టేమెంగాని."

"పాపం వాళ్లేంచేస్తారు? నాలుగైదుమాట్లు వచ్చినా తడవకొకవంక చెప్పి ఆఖరుకు అయిదువంద లిస్తే పంపుతానంటివి. ఇకవాళ్లేంచేస్తారు? ఇవ్వలేక ఊరుకున్నారు. నీ అల్లుళ్లకు నీవు ఇచ్చి తెచ్చావా? మాట్లాడితే వందలెక్కడ తెస్తారు పాపం వాళ్లు మటుక్కు."

"యేమెం లోకంతోపాటుగా అన్నీ ఇస్తారు గదా అనుకున్నాను గాని అన్నీ ఇల్లా మన్నాచుడతారనుకో లేదు. యేమైతే నాకెందుకు లెండి. ఇంకా వాళ్ల గుమ్మం నేను తొక్కతానా?"

"పోని నీ మొఖం తగలెయ్య! యింతతృప్తిలేందానికి యేం పెట్టి యేం ప్రయోజనం. రాక్షసి! ఆ పిల్లవస్తే మటుక్కు నువ్వు నేగనివ్వబోతున్నావా? ఏమైతే నాకెందుకు ఇవ్వాలో లేపో చావుసిద్ధంగా ఉన్నవాడికి భగవంతుడా" అని కళ్లుమూసుగున్నాడు పానకాలు.

*

రాఘవరావుకు భార్య కాపురానికివచ్చింది కాని ఖాయమైన ఉద్యోగంమాత్రం కుదరలేదు.

రాజేశ్వరి అత్తవారింటికి వచ్చినప్పటినుంచి సుఖము సంతోషము యెఱుగదు. కోడలు ఇంటిలో అడుగు పెట్టినప్పటినుంచీ వెంకమ్మగారు వీథిఅరుగు దిగడం మానుకుంది. జీతగాణ్ణి మానిపించింది. చాకలివాన్ని మానిపించింది. ప్రొద్దుగూకులు ఇంటిపనికంతా రాజేశ్వరి బాధ్యత. పాచిపని గొడ్లదగ్గర బాగుచేయుట మొదలు నీళ్లు తేవటం వంటపనులన్నీ రాజేశ్వరి వక్కతే చెయ్యాలి. పగలు భర్తగారితో మాట్లాడ కూడదు. అందరు వెళ్లే వేళకు చెఱువుకు వెళ్లకూడదు. పీడను అంట్లుతోమకూడదు. ఇన్ని కట్టుబాట్లు రాజేశ్వరికి. అత్తవారింటికిరాంగానే పుట్టింటివారు పెట్టిన సొమ్ముకూడా తీసుకుని చేతికి మట్టిగాజులు మెళ్లో పసుపుకొమ్ము కట్టింది వెంకమ్మ. రాజేశ్వరి బస్తీపిల్ల. ఇట్లో పనిపాట్లు చేసిందికాదు. చదువు ఆటపాటలు తప్ప ఇంకొకపని చేసియెఱుగదు పుట్టినింట్లో. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ వక్కమాటు కొండవిరిగి పడ్డట్టుగా జీతగాడు చేసేపని దగ్గరనుంచీ వంటమనిషి చేసేపని వరకు రాజేశ్వరి నెత్తినపడ్డది భారం. యెంతపని చేసినా చెప్పిచేయించుకుంటే కొంచెము తేలిక. లేక చేసినట్లు ఊరుకుంటే అంతకంటే తేలిక. అదీఇదీ కూడాకాదు రాజేశ్వరి అత్తగారి పద్ధతి. తాను ఇల్లాచెయ్యమని చెప్పదు, చేసినట్లు ఊరుకోదు. పనులు ఆజ్ఞాపించడం, క్షణక్షణానికివచ్చి 'ఇంకా కాలేదా?' అనడం చేసి నట్లాయనా ఈపని అల్లాచేశావు ఆపని యిల్లాచేశావు అని వంకలుపెట్టి చీవాట్లుపెట్టటం ఆమెవంతు. 'క్షమయాధరిత్రిన్' అన్నపదాన్ని సార్థకంగా చేస్తున్నది రాజేశ్వరి. తల్లి యెన్ని అక్షరాలు చెప్పితే అన్నిఅక్షరాలు నడవాలిగాని హెచ్చుతగ్గు నడవడానికి వీల్లేదు రాఘవరావు. భార్య అన్నముపెడితే తిన కూడదు రాఘవరావు. తల్లిపెడితే తినాలి. భార్యా తానుకూడ లేకపోతేలేదు. చెయ్యడంవరకే రాజేశ్వరి వంతు, తినడానికి అర్హతలేదు. అత్తగారుపెట్టిన అర్ధన్నంతిని రాజేశ్వరి మధ్యాహ్నం వొంటిగంటవేళ

మిడమిడకాశే యెండలో అంట్లువేసుకుని తోముతున్నది.

రాజేశ్వరి పదునారువత్సరముల బాల. యెండ తగిలితే వాడిపోయే శరీరము. చక్కని కనుముక్కు తీరుగలది. చదువు సంగీతము కుట్టుపనులు అన్నీ నేర్చుకున్నది. యేమి నేర్చుకుని యేమి ప్రయోజనము? అత్తగారిముందర అడివిన గాచిన వెన్నెలచందముగా ఉన్నది రాజేశ్వరి బ్రతుకు. తాను వచ్చినప్పటినుంచీ తండ్రి యెన్ని ఉత్తరములు వ్రాసినా జవాబు వ్రాయరు, తనను వ్రాయ నివ్వరు. పంపమని వస్తే పంపరు, మాట్లాడ నివ్వరు. మళ్లీ ఈరోజా ఉత్తరంవచ్చింది తల్లికిజబ్బుగా ఉన్నదని, అక్క చూడటానికి వచ్చిందని, పంపుతామని వ్రాస్తె వచ్చి తీసుకువెళ్లతామని వ్రాశాడు తండ్రి. ఆయెండలో అంట్లుతోముతూ తలంచుకున్నది తనస్థితి. తనను ఇంత కఠినముగా చూడటానికి కారణం యేమైఉంటుందీ? అని తనలోతాను విచారపడుతూ కళ్లనీళ్లు తెచ్చుకుంది. రెండు కన్నీటి బిందువులు క్రిందపడ్డాయి.

భర్త పోయినప్పటినుంచీ వెంకమ్మగారికి అధికారం యెక్కువైంది. నెత్తిమీదికి కత్తివస్తే కలక్టరంత పోడావస్తుందన్నట్లు ఆమె అధికారమంతా కోడలిమీద చలాయిస్తున్నది.

“యేమే రాజేశ్వరీ! అంట్లుతోమటం ఇంకా కాలేదూ? ఎంతసేపైందే దొడ్లో కూర్చుని. ఎందుకు ఏడుస్తున్నావు? నేమంతా బ్రతికిపోయినామనా? నిన్న తిండి అరగలేదా? నీ యేడుపే కొడుతున్నది కొంపకు. నీపుస్తె ముడిపడ్డది మొదలు మాకొంప నాశనం అవుతున్నది. పుస్తెముడేసి రాంగానే మామగారు చచ్చాడుగదా. ఇక నేనున్నానని యేడుస్తున్నావా? నీ యేడుపు కొట్టేపోతున్నది కొంప. బిడ్డ అష్టకష్టాలు పడుతున్నాడు. ఇంకా నీ యేడుపెందుకే? దిక్కుమాలినదానా. నా కొడుక్కేసమె కన్నది కాబోలు మీఅమ్మ. యెన్నన్నా మాటామంతీలేదు మొద్దురాచిప్పలాగ. తోటివాళ్లు పనులన్నీ చేసుకుని గొడ్లకు గడ్డి తేవడంలేదూ? మాకా రాతలేదు. దున్నపోతులాగ నిన్ను మేపి గొడ్డుకు గడ్డికొనాలి. యేమి సుకుమారం వెళ్లబోస్తున్నావే అమ్మా. అంట్లుచెట్టునీడను దప్ప తోమకూడదూ? యెన్నిమాట్లు చెప్పాను చెట్టు పాడైపోతుందని.”

“చెట్టుకో అంట్లు తోమలేదండీ. ఇప్పుడే తోలిచి ఇక్కడికి తెచ్చాను” అన్నది రాజేశ్వరి నెమ్మదిగా.

“అదుగో యెదురు జవాబులుకూడా చెపుతున్నావూ! నా ప్రారబ్ధంకొద్దీ దొరికావు” అని నెత్తి మోదుకుంటూ వాకిట్లోకి వెళ్లింది వెంకమ్మగారు

రాజేశ్వరి అంట్లు తోలిచి దొడ్డి అరుగుమీదపెట్టి తడిబట్ట బిందెలోవేసుకొని “అత్తగారూ! అంట్లు చూచివెళ్లితే ఇంట్లో పెడతాను” అని చెఱువుకు వెళ్లబోతున్నది.

“నీళ్లకు దబ్బున వెళ్లిరావే అని నెత్తినోరు పెట్టుకొని చెప్పినా నలుగురు వచ్చేవేళకు గాని రైలుదేరవు. వాణ్ణి వెధవనుచేశావు. నన్ను చూస్తే అసలే లక్ష్యంలేదు. నీ ఇష్టంవచ్చినట్లు చేస్తున్నావు. నీవు రాణి వయావులే. నిన్న మొన్న వచ్చిందానివి. యెంతదానివయావే? మాట్లాడకుండా తడిగుడ్డలతో గొంతులు కోస్తున్నావు.”

“ఇంకా అందరు వచ్చేవేళ కాలేదండీ అత్తగారు. ఇప్పుడే రెండు గంటలైంది” అన్నది రాజేశ్వరి జాలికలిగేటట్టు.

“యెదురు జవాబుచెప్పటం బాగా నేర్చావు. నాకేం తెలుసు పల్లెటూరి చచ్చిందానికి? బస్తీ పిల్లవు గనుక నీకు గంటలు తెలుస్తాయి. నువ్వు ఇన్నిమాటలు జవాబు చెపుతున్నా అగదిలో కూర్చుని మాట్లాడుతాడేమో చూడు మొద్దులాగ. అల్లాచేశావు వాణ్ణి. తిరుగలేం వెనక్కు. నీళ్లకిప్పుడు వెళ్లొద్దు. పొద్దుపోయాక వెళ్లుదుగాని. అన్నీ నీ ఇష్టప్రకారం చెలా

యించుదామంటే సాగుతాయనుకున్నావా? నీవు చస్తే రెండో పెళ్ళన్నా చేస్తాగాని నువ్వు చేసినట్టు ఊరుకోను. లేకపోతే లేదిపో. ఇప్పుడుపో నీ పుట్టింటికి" అని కసిరింది వెంకమ్మగారు.

రాజేశ్వరి ఇంట్లోకివచ్చి కండ్లు తుడుచుకుని "అత్తగారూ! అంట్లు ఇంట్లో పెట్టనా?" అన్నది నిర్జీవంగా. "పెట్టూ నువ్వొచ్చినప్పటినుంచీ అంట్ల కూడూ మైలకూడూదప్ప శుచిశుభ్రము ఉన్నదీ? అన్నీ శ్రాద్ధాన్నె చూసేడుచుకుంటూ. వెడంగా తగలెయ్యి" అని వరండాలో ఫెడేలుమని మంచం వాల్చుకుని పడుకొన్నది వెంకమ్మ.

౬

చాలా ప్రయత్నంమీద నరసారావుపేట బోర్డు ఎలిమెంటరీస్కూల్లో ఖాయమైన నౌకరీ దొరికింది రాఘవరావుకు. రాఘవరావుకు తల్లీ భార్యా కలతల విషయం తెలుసు. తప్పంతా తన తల్లిదేననికూడా బాగా తెలుసు. అయితే తాను జోక్యం కలుగజేసుకొనని కారణం ఏమిటంటే తల్లికి తాను వక్కడే కొమారుడు. ఏమిటమ్మా ఈ కలతలు అని అడిగితే తాను వేరే ఉంటానంటుంది. లేకపోతే కూతురిదగ్గరకి వెళతానంటుంది. తలచెడ్డ అక్కకూడా చేరింది. ఇద్దరుకలసి తననే అల్లరిపెడతారని భయం. భార్య ననటానికి కారణ కనిపించదు. భార్య గుణము తనకు బాగా తెలునును. ఎక్కువ నిదానం కలది, శీలవతి, గుణవతి, రూపవతి. తల్లి ఇన్నికష్టములు పెడుతున్నా ఇరుగుపొరుగు వారితోగాని తనతోగాని ఎన్నడు చెప్పకొని ఎఱుగదు. ఇల్లాగంటి పరమసాధ్వీమణిని ఏమి అనటానికి తోచలేదు రాఘవరావుకు. అనకపోతే భార్యను నెత్తిన ఎక్కించుకుని ఊరేగుతున్నావని తననుకూడా అంటుంది తల్లి.

రాఘవరావు నిదానంకలవాడు. బుద్ధిమంతుడు తెలివితేటలు కలవాడు. పదిమంది పెద్దమనుష్యులతో తిరుగనేర్చినవాడు. వస్తుత నిదానంకలవాడైన రాఘవరావు కత్తి వాగలిసందునా నలిగిపోతున్నాడు.

నరసారావుపేట కాపురం. అంతా చేరారు. రాజేశ్వరి యెన్నిరోజులనుంచో వోర్చుకుని స్వాతివానకు ముత్యపుచిప్పలాగ, కనిపెట్టుకుని కూర్చున్నది. భర్తకు ఎక్కడనున్నా ఉద్యోగమైతే ఐస్త్రీలోసుఖపడుదామని యెదురుచూస్తున్నది. ఐస్త్రీచేరినప్పటికి ఏమీప్రయోజనం కనిపించలేదు. రాజేశ్వరి ఇక్కడికి వచ్చేటప్పటికి ఇంకోగ్రహం హాజరైంది. పెద్దాడబడుచు భర్త పోయినాడు. ఆవిడ ఇక్కడికే చేరింది. అత్తగారికంటే ఇంకాకఠినత్వము, నిర్దయా, యెక్కువ ఈమెకు. స్వంత ఊరు పల్లెటూరైనా నీళ్లుముంచుకరావడమేతప్ప తోడక్కర్లేదు. ఇక్కడ చాలా లోతునుంచి నీళ్లుతోడటం. రాజేశ్వరి వక్కతేకావడంచేత చేతులుకాయలు కాస్తున్నాయి. అంతచక్కనిపిల్ల గుర్తుపట్టలేనట్లుగా మారిపోయింది. అమృతపాత్ర లభిస్తుందనుకున్న రాజేశ్వరికి విషతుల్యంమైంది. రోజులు గడచుట దుర్భరంగా ఉన్నది.

నరసారావుపేటవచ్చి కొద్దిరోజులైనా, ఊరంతా పరిచయమైంది వెంకమ్మగారికి. పురాణాలకు వెళ్లడం, గుడికి వెళ్లడం, పెత్తనాలకు వెళ్లడం బాగా అలవాటైంది. ప్రక్కంటి ఇన్‌సుపెక్టరుగారి తల్లివచ్చి "వెంకమ్మగారు ఇవ్వాళకూడా పురాణానికి రారు? వారంరోజులనుంచీ రావడం మానేశారు?" అన్నది.

"యేం చెయ్యను కామమ్మగారు మీకు నిక్షేపంలాంటి కోడలు వరాలకుప్ప దొరికింది గనుక మీరు యెక్కడికి వెళ్లినా జరిగిపోతుంది. నా కోడలు అరవందప్పిల్ల అన్నిపనులు నేనే యీడవాలె. మళ్లీ తెలివితక్కువది కాదు. కావలసినంత కాణాతనం ఉన్నది."

"నీవు అన్నీ నెత్తినేసుకుంటావు గనుక చెయ్యాలి. నువ్వూరుకో ఆవిడే చేసుకుంటుందో లేదో చూడొ

చ్చు మనకోసం చేసుకుంటారా? మనం నెత్తిన వేసుకుంటే మనకే బాధ. నేనేమి కలుగజేసుకోను గనుక నా కోడలు మంచిదిలా కనిపిస్తుంది. నా కోడలు నెరజాణ. అయితే ఆవిడ పనులకు నేను కలుగజేసుకోను గనుక అందరికీ ఆవిడ మంచిదిలాగ కనిపిస్తుంది. క్లబ్బులని మీటింగులని లెక్చర్లని ఆవిడ స్నేహితులు ఆవిడ మూడింటికే వెళ్లుతారు. వాడు వచ్చే వేళకు వస్తుంది. ఇవ్వాళ అప్పుడే వెళ్లింది, తాసీలుదారి కోడలు ఆవిడాను. వెంగుడికిష్టమైనప్పుడు మనకెందుకు? ఆడుకునే పిల్లలు, షికారుకు పోయినా కొడుకు, చదువుకునే పిల్లలు, ఆవిడాకూడ వక్కమాటు వస్తారు. చంటిపిల్లవాడు ఏడుస్తూ ఉంటాడు. పాలు పెరుగు తెచ్చి వాళ్లు నుంచుంటారు. ఇంత గిజాలుగా ఉన్నప్పుడైనా. 'అదేమిటా' అని వాడు అనడు. అలాంటప్పుడు నాకెందుకూ? అని నేను చూస్తూ ఊరుకుంటాను. వాళ్లు తిన్న వేళకు నాకూ కాస్త పెడతారు. అలా పూరుకోవాలి గాని, వెంకమ్మగారు! ఇంకా మనకెందుకు ఈ గొడవలు?"

"నా కెందుకూ అని ఊరుకుంటే నా కెలా జరుగుతుంది? ఇరువు చెడ్డ ఆడపిల్ల ఇంట్లో ఉన్నప్పుడు దాన్ని చూడొద్దూ?"

"సరే నీ ఇష్టం నీవు రాకపోతె నేను వెళ్లుతున్నా" అని వెళ్లింది కామమ్మ గారు.

రాత్రి ఏడుగంటలైంది. అత్తగారికి ఆడబిడ్డకు భర్తకు వకేమాటు వడ్డించి ఏమి హెచ్చుతగ్గు వస్తుందో అని ప్రాణాలన్నీ పిడికిట్లో పెట్టుకుని గోడవారగా నుంచున్నది రాజేశ్వరి.

ఉప్పుపిండి విస్తరిముందరికి తీసుకుని "యేమె రాజేశ్వరి! పిండిలో పెసరపప్పు వెయ్యమంటే కొబ్బరి కోరువేశావు నీ కిష్టమా యేం? అల్లా నుంచున్నావేం మొద్దులాగ? యెందుకు వెయ్యలేదు పెసరపప్పు? ఈ పిండి నా కొద్దు నీముఖానకొట్టుకో. అన్నమూ పిండీకూడా నీ పొట్టనే పగలకొట్టుకో. ఒక్కపూట పిండి తిని భగవంతుడా ఏడుస్తున్నా" అని రివ్వున లేచి వెళ్లింది విస్తరి ఒదిలిపెట్టి ఆడబిడ్డ.

ఈ ఘర్షణ వింటూ పెద్దదౌతుందనే ఉద్దేశ్యముతో చప్పున రెండు మెతుకులు తిని ముందే లేచాడు రాఘవరావు.

"యేమే రాజేశ్వరి! దానికి వేడిచేసి పెసరపప్పు వేసి పిండి చెయ్యమంటే నీ ఇష్టంవచ్చినట్లు చేస్తావా? ఇంత లక్ష్యం లేదేమే నీకు? దిక్కుమాలిన దయ్యమా. నువ్వు వస్తే నా కొడుక్కు రెండో పెండ్లి చేస్తానే పోయిగాను. మరీ కడుపొచ్చింది మొదలు మూడోకన్ను తెరచావు. బిడ్డతల్లి సొతాకదా అని కాబోలు నీసంతోషం. వాణ్ణి వల్లో వేసుకుని పొట్లాలు పొట్లాలు దులుపు కుతినడం మరిగి ఆడుతున్నానను కుంటున్నావు కాబోలు. నీ ఆటలు సాగవిక్కడ. ఆ పనివాడు కాంతం చేతులో అన్నా వక్కరవ్వ పెట్టవు. దీనికి తెలితేరుగదా? దాని పిల్లవాడు ఒక్కమాటువస్తె పరి కళ్లల్లో పెట్టుకుంటావే. నీ దిక్కుమాలిన తని మొఖం చూడగూడదే" అని విస్తరిముందు నుంచి లేచింది వెంకమ్మ.

అత్తగారు ఆడబిడ్డ తినకుండా తాను తింటే ఊరుకోరు. యేం చేస్తుంది తానుకూడా తినకుండా మూతలేసి ఇల్లు కడిగి పడకగదిలోకి వెళ్లింది రాజేశ్వరి.

ఈ రోజు అప్పుడే వచ్చింది అన్నం తినలేదని గ్రహించాడు రాఘవరావు.

"రాజేశ్వరీ! నిండుచూలాలువు గదా? నీవు కూడా భోజనము చేయకపోతే కష్టంగాదూ?" అన్నాడు రాఘవరావు జాలిహృదయంతో.

"నేను అన్నంతినకపోతే యెవ్వరికిజాలి. మీతల్లిగారుఅక్కగారుఅనేమాటలు వింటూఉంటేకడుపులో పేగులు దూసుకొస్తున్నాయి, ఎన్నాళ్లుపడను ఈమా

టలు ఈకష్టాలు, ఈఇంట్లో అడుగుపెట్టింది మొదలు పుట్టినిల్లెరుగనుగదా? మొన్నమాయన్నగారు పురిటికి తీసుకెళ్లటానికి వస్తేఇంటికిరానివ్వక నానామాటలు అన్నది తమరికి తెలుసునుగదా? పొరుగింటి సీతమ్మగారింట్లోఉండి నాకు చీరలు రవికలు కొనిఇచ్చివెళ్లితే ఆ చీరలుతీసుకుని చిన్నవదినెగారికి పంపింది. మళ్లీ నా చిరుగులచీరలను నేను ఇల్లాఅనుభవించవలసినదే. ఎన్నాళ్లు ఈ కష్టాలు. మొన్న మా పిన్నికూతురు చేమంతిపూలపొట్లాము పంపిందే, అవిచూచి నేనేమొ తెప్పించుకు తింటున్నానని గోలపెడుతున్నది; ఏంచెయ్యను?" అని రాజేశ్వరి కళ్లనీళ్లపెట్టుకున్నది.

"రాజేశ్వరీ! నేనేంచెయ్యనూ? అన్నీ చూస్తూనే ఉన్నాను. మా అమ్మకు నేను ఒక్కకుమారుణ్ణి. ఏమన్నాఅంటే భార్యపక్షంచేరి నాతో పోట్లాడావంటుంది. నేను వేరేఉంటావంటుంది. ఒక్కకొడుకుని తల్లిని వేరుపెట్టారంటారులోకం, అన్నీలోఆలోచించి నేనూ ఊరకుంటున్నాను. ఎప్పటికన్నా మంచిరోజులు రాకపోతాయా? ఆమె ఎన్నాళ్లు బ్రతుకుతుంది?" అని ఏవో నాలుగ చల్లని మాటలు చెప్పాడు రాఘవరావు.

"ఏంచేసినాసరే మా తల్లితండ్రులు పదునాలుగేండ్లు పెంచి మీచేతుల్లో పెట్టారు చంపినామీరే, బ్రతికించినామీరే" అని రాజేశ్వరి కొంచము సేపు కళ్ల నీళ్లుకార్చి నిద్రపోయింది.

2

రాజేశ్వరి ప్రసూతిఅయింది. ఆడశిశువు కలిగింది. శిశువు భూమ్మీదపడగానే రాజేశ్వరి స్మృతితప్పి పడిపోయింది. వెంకమ్మగారు ఖంగారుపడుతూ వాకిట్లోకి వచ్చి 'అబ్బాయి! రాజేశ్వరి మాట్లాడ్డంలేదు నాయనా డాక్టరుగార్ని పిలు' అని అదుర్దాగాచెప్పి మళ్ళీ ఇంట్లోకి వెళ్లింది.

వెంటనే జట్కాబండి తీసుకెళ్లి డాక్టర్ని తీసుకొచ్చాడు రాఘవరావు. డాక్టరు ఇంజక్షను ఇచ్చాడు. రాజేశ్వరికి కొంచం తెలివివచ్చింది. గాని తాను ఇక బ్రతుకనని తోచింది రాజేశ్వరికి. తాను చెప్పదలచుకున్న రెండుమాటలు చెప్పాలనుకున్నది.

డాక్టరు గుండె, నాడి పరీక్షించారు. ఇక లాభంలేదనుకుని 'హోప్లెస్ సార్' అని బండి ఎక్కబోతున్నాడు డాక్టరు. రాఘవరావు బండిదగ్గరకు వచ్చి డాక్టరు రెండు చేతులు పట్టుకుని "మీ రడిగిన డబ్బిస్తాను మందివ్వండి" అన్నాడు.

"మందిచ్చినా లాభంలేదండీ. గర్భిణీస్త్రీ చెయ్యకూడని పరిశ్రమ చేయించినారు. అందువల్ల నరములు గుండె బలహీనమై చెడిపోయినవి. ఆమె ఆహారము కూడా మంచిది తిన్నట్లు కనిపించుటలేదు. ఇక లాభంలేదు" అని వెళ్లిపోయినాడు డాక్టరు.

రాజేశ్వరి కండ్లు తెరచి ఒక్కమాటు భర్తను పిలవమన్నది. అక్కడేఉన్న రాఘవరావు ఎందుకన్నాడు కండ్లు తుడుచుకుంటూ.

"నాకు ఒక్క కోర్కె ఉన్నది. ఇప్పుడన్నా తీర్చండి. ఈబిడ్డ బ్రతికితే నా తమ్ముడికిచ్చి పెండ్లి చెయ్యండి. నామాదిరిగా కష్టాలపాలు కాకుండా సుఖంగా బ్రతుకుతుంది. మీఅమ్మ ఎన్నాళ్లు బతుకుతుందన్నారు గదా. నేనే ముందుపోతున్నాను. ఎవరి బ్రతుకు ఎవరికి తెలుస్తుంది? మీకు ఇదేనా కడాసారి వందనం. నేను వెళ్లిపోతున్నా. అత్తగారు మళ్లీ మా అమ్మను చూపించారు కారు గదా? మీకు ఇదే నా నమస్కారం" అన్నది.

రాజేశ్వరి కళ్లు మూసుకుపోయినాయి. అంతా గొల్లుమన్నారు.

# కాఫీ

శ్రీమతి సుధేష్ణబాయిగారు

ఈమె పుట్టినిల్లు ఏదో, మనకు ఈమె ఏలాగు సంప్రాప్తించెనో, రూపించుటకు నాకు తెలియదు. సంస్కృత గ్రంథములలో కంటకమగు పల్లేరుకాయ మొదలు మహా వృక్షములవరకు నామధేయములుండగా మహాకల్పతరువుగ పరిగణింపబడుచుండు ఈ మొక్కకు పేరులేదని పండితులు చెప్పుట వలన ఇది ఏ యన్యదేశమునుండియో వచ్చినదని చెప్పవచ్చును. సిరినన్వేషించుచు వచ్చిన ఏ సర్ టీ. రో లేక హాకిన్సుయో దీనిని తెచ్చి నూర్జహానునంటి పట్టమహిషులను వ్యామోహింపచేసి ఏ సుముహూర్తమున మన దేశమునందు దీనికి యంకురార్పణమొనర్చెనో తదాదిగా ఇది నలుదిక్కుల వ్యాపించి మన దేశమునే ఇప్పుడు పెంపుడుతల్లిగ చేసుకొన్నది.

ఈ దేవతమహిమను వర్ణింపలేము. ఏలన, అసంఖ్యాకములగువారు ఆమెకు దాసులై యామెను తమ ముఖ్య యాహారమునకంటె ప్రీతికరముగా గ్రోలుచున్నారు. ఈమెయే పూర్వకాలమున మన దేశమునందుండెడిచో యజ్ఞమునందు ఉపయోగించిన సోమరస పానమునకంటె ఈ కాఫీరసమునకే ప్రాముఖ్యత ఇచ్చియుందురు. అయినను ఆ కొదువను ఇప్పటివారమగు మనము తీర్చి పుణ్యము గట్టుకొని వన్నెకెక్కినాము. ఇప్పుడు ఈ దేవత మన దేశములో అందులో మదరాసు దక్షిణజిల్లాలలో సర్వాంతర్యామియైయున్నది. ఏ పల్లెలో చూచినను ఈమెయే. ఇక పట్టణములలో ఏ సందుగొందులయందును, అంతఃపుర బహిరంగములయందును, క్లబ్బులు హొటళ్లలోను, సముద్రనదీతీరములలోను, ఎగువ తిరుపతి మొదలగు పర్వతపంక్తులయందును, వాయువిమాన, నావిక, ధూమశకట, ఆశ్రయపరిసరములందును, వేయేల, అందుగల దిందులేదను సందేహము వలదన్నట్లు ఈమె విశ్వరూపము ఎల్లెడలతిసులభముగ గోచరమగుచున్నది. రాజు మొదలు రైతు వరకును, యగ్రజాతి మొదలు అంత్యజాతి వరకును, ఆరోగ్యవంతులు, అనారోగ్యవంతులును, స్త్రీ పురుషులును, బాలురు వృద్ధులును, ఆబాలగోపాలమువరకును జాతి మత కుల కక్ష స్థితిగతుల భేద తారతమ్యము లేక యందరు ఈ దేవతను పూజించి 'ధన్యోస్మి' యనుచున్నారు. ఏ కార్యములు జాతకనామకరణాది శుభకార్యములు మొదలు అంత్యక్రియలవరకును, ఆహ్వాన సంఘములు మొదలు వీడ్కోలుపు విందుల తోను బంధు మిత్ర పరస్పర క్షేమలాభ

విచారణలతోను, అది ఇది అనక ఏ కార్య కలాపములోగూడ అగ్రతాంబూలము ఈమెదే. ఈమెకు తావొసగి గణపతి కూడా తొలగినాడు.

ఈమె భక్తిపూర్వకముగు 'పత్రం, పుష్పం, ఫలం తోయము'లతో సంతుష్టి పడదు. సువర్ణపుష్ప దక్షిణలే ఈమెకు ఆహుతి. ఈమె అవగుణములను కొందరు గుర్తెరిగియేయున్నారు. ఈ మూలికలో సుగుణము లేదనియు, ఇది పుష్టికరముకాదనియు, వ్యాధి మూలమనియు వైద్యులు చెప్పుచున్నారు. అర్థశాస్త్రజ్ఞులు ఇదిధన నాశహేతువనుచున్నారు. అనుభవజ్ఞులగు గృహస్థులు దీనిని సంసారవిధ్వంసమని పేర్కొనుచు, సంసారవ్యయములలో పాతిక వంతు ఈ పానీయమునకే సరిపోవుచున్నదని ప్రలాపించుచున్నారు. కొందరు విసికి దీనిపై కొంతపన్ను విధించినచో దీనిప్రచారము తగ్గి మద్యపాననిషేధమువల్ల దొరతనమునకు గలిగిన లోటును పూడ్చు నను భావములను తెల్పుచున్నారు. ఐతే చట్ట నిర్మాణసభికులే దీనికి దాసులై యుండ ఈమెపై చేయినెత్త సాహసించువారెవరు?

ఈ దాసులలో పురుషులే ఎక్కువ సంఖ్యాకులు. స్వేచ్ఛానువర్తనులగు ఈ పురుషులే ఈమె యాలయములలో సర్వకాల సర్వావస్థలయందును దక్షిణల సమర్పించి నైవేద్యమును స్వీకరించుచుందురు. స్త్రీలింతవరకు ఇంతటి నాగరీకతకు సమీపించియుండలేదు. గృహములు ఆరోగ్యవంతములై బిడ్డలు పుష్టివంతులై యుండవలెనన్నచో స్త్రీలు పురుషులు కాఫీ త్రాగు దురభ్యాసమును వదలుకొనుట మేలు. స్త్రీలమగు మనము ఈ కార్యమునకు పూనుకొన్నచో గృహములు భాగ్యతరములై నుండుననుటకు సందియము లేదు.

# కాశ్మీర మజిలీలు

## ప్రళయానంతరము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

మహాప్రళయము ముగిసినది. కాని నాటి కల్పాంతమున నెవ్వరికి నెట్టి అపాయము వాటిలలేదు. పరువెత్తుకొని వచ్చిన ఇరుగు పొరుగువారు ఇపుడు ప్రమోదసంభరితులైరి. మనుష్య మానసమెట్టిదో! ఇందును శుక్లపక్ష కృష్ణపక్షము లున్నవి కాని మానసికమైన పక్షము పదునేను దినముల పరిమితిగలది కాదు. అనుక్షణమీ పక్షములు గుండెలో దిర్దిర దిరుగుచుండును కాబోలు. నిముషమునకు మున్ను ఎల్లరి హృదయములు శోకాంధకారములో నిండి యుండెను. నగుమోము పతివలె నిప్పుడందు శుక్లపక్షము వెలయుచున్నది.

అరుగులపై నూరివార లాసీనులై, ఇష్టాగోష్ఠి సలుపసాగిరి. అమాయికులు, పల్లెవాసులు, పవిత్ర వర్తనులు, మనసిచ్చి మాట్లాడువారు, వెలగట్టి మాట్లాడరు. గ్రామవాసుల సాంఘిక జీవితమెట్లు నడచుచున్నదో తెలియగవలెననిన గొండొకవడి వారి ప్రసంగమును వినిన జాలును.

ప్రీతిప్రసంగములతో తెల్లవారినది. కొన్నిగంటల యిష్టాగోష్ఠివలన వారితో గాఢమైన మైత్రికలిగెను. దూర ప్రదేశమునుండి వచ్చితినని కాబోలు, ఏదో చదివి వడబోసిన వ్యక్తినని తలంచి కాబోలు, నన్ను సిగ్గుపడుచు భక్తి శ్రద్ధలు వారు నాకు జూపదొడగిరి. వంగబీహారు సంయుక్త రాష్ట్రములందలి పల్లెలందు వసించినపుడిట్టి దృశ్యమును పలుమాఱు అవలోకించితిని. గ్రామవాసులు మహాత్ములు కావున నెదుటివాడు మహాత్ముడేయని యపోహపడి వాని ప్రేమాల సాగిల పడుచుందురు.

తమతమ యిండ్లకు రండని నన్ను కొందఱాహ్వానించిరి. పట్టణవాసమున మనసున ప్రోగైన పాడుతలపులను కడిగి వేసికొనుట కిట్టి పవిత్రాత్ముల సఖ్యమే ఏకైక సాధనము. కొంతకాలము వారిలో వసించిన యెడల మనుష్య చరిత్రలోని స్వర్గము దృగ్గోచరమగుననియు, పాడుభూతములవలె నైహికజీవితముపై వ్రాలిన పేగు లంతర్ధానమగుననియు, అపూర్వభావప్రాభవము భగతిపై నెగసివచ్చిన దేవదేవునివలె హృదయమున జేరుకొనుననియు, ముక్తిమందారము మనసున గుసుమించుట! గుఱుతించి, ఆత్మనందన దృశ్యములను గని, మనుష్య జీవితమహత్త్వమును గ్రహింపజాలుదుననియు నెఱుగుదును. కాని రెండు దినములలో తల్లిగారి తద్దినము పెట్టవలసియున్నది. పంజాబుపల్లెలో తద్దినము పెట్టుటెట్లు పొసగును? చేయవలయు పయన మింకను ఎంతో కలదు. అచిరములో రాజస్థానమునుండి శారదను తోడ్కొని రావలెను. కావున వెంటనే కదలిపోక తప్పదు. నా యెడల నెంతో యాదరము నెంతో యనురాగమును చూపిన నెచ్చెలులకు హృదయపూర్వకముగ ధన్యవాదము లర్పించి పోవలసిన యక్కఱ అను వారికి విప్పి చెప్పితిని.

ఆ మిత్రులలో నాకు విశేషమైన ప్రీతి గొలిపినవాడు ఒక బాలుడు. వాని వయసు పదునేను వత్సరములను దాటియుండదు. ఎంతో భక్తితో ప్రసంగించుచు చీటికి మాటికి భగవద్గీతలోని శ్లోకములనే కరువు పెట్టసాగినాడు. నా యబ్బురమునకు నానందమునకు మేరలేకుండెను. మతవిద్యను మృగ్యము




సూ ర్యో ద యం



'నేనూ సైకిలు తొక్కుతా'...



"అమ్మా! టక్ టక్ ఎక్కి-
బడికిపోతున్నా..."





"పూలుకోచి...పూజచేత్తా..."



గావించుకొనిన ఆంగ్లవిద్యాసంస్థలందు ప్రవేశింపని అదృష్టవంతుడా డింభకుడని గ్రహించితిని. సమస్త విజ్ఞానము భగవద్గీతలో కలదని గుర్తించిన బాల్యజ్ఞాని యతడని యూహించితిని. పూరీస్వామిజీ* అమృతసరమున పెక్కు నెలలు భగవద్గీతోపన్యాసములు గావించినపుడు బాలుడు దండుండి బహుశ్రద్ధతో గీతను పఠించినాడట. గ్రామవాసులలో విద్యాగంధము లేదనియు, ఈగంధమును బాగుగ పట్టణవాసులే మనమునకు పులుముకొనిరనియు తలచుగ నుపన్యసింతుము. విక్రమము దీనికి చుక్కెదురై యున్నదని చెప్పనోప్పను. గంధరహితములైన బండెడుపూలెట్టివో మతమహత్త్వమునకు దూరస్థములైన పుస్తకములును అట్టివే! ఇట్టిపూలతోనే అస్మదాదులము సరస్వతిని పూజించుచు వచ్చితిమి. పూవు తావికిని, భక్తిభావమునకును, ఉపాస్యదేవతయొక్క ప్రణయభావమునకును అవార్యమైన సంబంధము కలదు. కొండ డోలక వంటి గుండెను బూని, పూజాప్రదర్శనమునకై ఏదో పూవును చేగొని, దేవిగ్రామాల నుపవసించినవాడు దేవికి పెక్కుమదలందే పడియుండును. భావరహిత హృదయము భావసహితపుష్పము నెట్లు వలచును? భగవతి నెట్లు గుర్తించును? భావసహితభక్తుడు సమ్ముఖమున సాగిలపడినపుడు శిలావిగ్రహమందలి జగద్ధాత్రి లేచి "బిడ్డా!" యని వాని నక్కున జేర్చుకొనును. స్తంభమునుండి భగవంతుడు వెడలెననిన రాతినుండి భగవతి వెడలజాలదని పలుకువారెవ్వరు? భక్తిరహితహృదయము ముంగల కెన్నిమాటులు బోర్లపడినను, నిజముగ నెదుట భగవతి నిలిచియే యున్నను, కఠినశిలావిగ్రహమునే కాంచును. పుష్ప హృదయమునకు గ్రామవాసి హృదయము సహపాఠి యన చెల్లును. సమ్ముఖమున నీతడు ప్రణమిల్లు సపత్ర ముహూర్తమందే పులకితగాత్రియై వాణి తనవీణను మీటును. అపుడే సహజసుందరగమనమున సమ్ముఖస్థ హంస సరస్వతి చుట్టు వసంతసంతసమున చరించును. అపుడే వీణాతంత్రులనుండి కామధేనువు పొదుగునుండి జాల్వారు పాలధారలవలె మధురగీతికాధారలు వెలారును. అపుడే సమస్త దేవతలు సత్యలోకమున చేరి నృత్యవినోదముల చేసెదరు. ఆ ముహూర్తమందే బ్రహ్మ తనలేఖిని నొకవంక నిడి శారదపసిమోమును రెప్పవాల్పక చూచి "నా ప్రాణధనమిది" యని మురియును. అపుడే దిక్కామినులు భజనసలిపి తమ పూలను దివిపైజల్లి అవి నక్షత్రములగుట గాంచి కులుకును. పాఠకులారా! ఉత్కృష్టభావమహత్త్వ మెట్టిదో, గంధసహితభావతత్త్వ మెట్టిదో యూహింపుడు. భవ్యభావము భక్తప్రవరుని హృదయమున ఖైదీయై పడియుండదు. చీకటిలోని గుసగుసయై, చీకటిలోనే యిది మడియదు. భక్తుని శరీర మేమూలనో వ్రాలియున్ననేమి? అందుండి యుత్థితమగు భావము అనంత అద్భుతశక్తివంది సమస్త విశ్వమందు నవజీవితమును, నవ్యసంచలనమును బుట్టించును సుడీ! ఇదియే కైలాసాలయమందలి జేగంటను మ్రోగించు శక్తి! ఇదియే సరస్వతీహృదయసరోరుహమును శతపత్రములతో వికసింపజేయు శక్తి! ఇదియే లక్ష్మీగళమందలి తాళిని సూర్యకిరణమువలె తాకి అందుండి యద్భుతస్వరములను తళ్కొత్తించు శక్తి! ఇదియే దిగంబరయోగియై ముక్కు మూసికొనిన మహాదేవుని నటరాజుజేసి భువనమోహననృత్యము నురికొలుపు శక్తి! ఇదియే సర్వాంతర్యామిని శ్యామసుందరు గావించి, అఖిల భువనములను గొల్లలజేసి ఆతని

---

* పదపడి ఈ స్వామిజీ పరిచయభాగ్యము నాకు లభించినది. ఈ స్వామిజీ నేటి పూరీపీఠాధిపతులైన జగద్గురువులు శ్రీ శంకరాచార్యులు. పూర్వాశ్రమమున కొంతకాలము వీరు రాజమహేంద్రవరమున వసించిరి.

యక్కున జేర్చు శక్తి! ఈశక్తి పల్లెహృదయమందు రాజిల్లినపుడు క్వారీలోని రాళ్లవలె మతభావరహిత భాండాగారములనుండి పొత్తములు గ్రామభూమిలో దొరలలేదని దుఃఖింపనేల? ఈశ్వర చింతాస్పర్శ తెలియని మానసములు,—డిగ్రీలమీదనే వ్రాలజేర్చిన మానసములు పల్లెజీవితము పొందలేకున్నవని దూపిల్లనేల? భూగోళము నధోగతిపాలు చేయు అసురశక్తు లెన్నో నేడు విజృంభించుచున్నను అతలసుతల రసాతల తలాతలములలోనికి వీనిని తరిమికొట్టి జగతిని జగదీశుని చేతి ముద్దుబిడ్డజేయు శక్తి మన పల్లెహృదయమునందున్నది. కావున జనవరులారా! మనము నిట్టూర్పులకు దీసనక్కఱలేదు.

చదివిన దానికిని చూపునదానికిని, చెప్పినదానికిని చేయుదానికిని నెయ్యమునుగాని వియ్యమునుగాని చేకూర్పక, తమ ప్రబోధ దృష్టాంతముల నడుమ లోతు గోతులు త్రవ్వు బహుళ నాగరక మేధావుల బోలక ఆధ్యాత్మికమైన విద్యనంది, అందినదాని నాత్మ జీవితమునం దనుష్ఠించు మహనీయగుణగరిష్ఠులు పల్లెవాసులని నాడు గుర్తించితిని.

కట్టెదుట బాలకుడు భగవద్గీత నేకరువుపెట్టుచుండ నాంతరంగికముగ వాని పూత హృదయమునకును, ఏసు ప్రభృతుల నలరించిన పవిత్రబాల్యమునకును ప్రణమిల్లితిని.

అచిరములో నా యూరినుండి పయనమయ్యెదనని గ్రహించి బాలకుడు "బాబూజీ! ఇచటికి అరమైలు దూరములో ఒక బావాజీ వసించుచున్నారు. ప్రతిదినము ప్రాతఃకాలమున వారికడకు పోవుచుందుము. తామా మహాత్ము నొకపర్యాయము దర్శించిపోరా?" అనినాడు. బాలుని వచనపరంపర నా హృదయమున శంఖారవమట్లు ధ్వనించి, అందుండి నూతనవాంఛను లేపెను. తోడన స్వామీజీ యాశ్రమమున కరిగి తదనంతరము తరల నిశ్చయించి బాలకునకు నా సమ్మతి తెలిగించితిని. తక్కిన యూరి నెచ్చెలులు పరమానందభరితులైరి.

పొట్టిపిచికి పట్టరాని యానందమున గంతులు వేయుచు "బహుత్ అచ్ఛా! బహుత్ అచ్ఛా!!" అని రాగధోరణితో నఱచుచు, తోంటా దిక్కుగా పరుగెత్తినాడు.

## ప్రేమ

శ్రీ బెల్లంకొండ విశ్వనాథరావుగారు

సీ. భక్తియుతంబౌచు భగవంతునైనను బాశబద్ధునిజేయ బడయగలుగు
శాంతియుతంబౌచు ధరణిపాలనమును శాసనంబులులేక జరుపగలుగు
ధర్మయుక్తంబౌచు భగవంతునైనను బాశబద్ధునిజేయ బడయగలుగు
విద్యాప్రయుక్తమై వివిధదేశంబుల బరువుయశంబు గూర్పంగగలుగు
తే. గీ. శ్రీయుతంబయి సర్వసంశ్రేయమొసగు
సత్యయుక్తంబునై దివ్యసత్వమొదవు
భూతదయగూడి సుజనసంపూజ్యమగును
జేరుబోనహింస మహాత్మసిద్ధిపొడము.

ఉ. శాసనముల్ బరాక్రమము సైన్యములుం శరచాపఖడ్గముల్
ఆసురకృత్యముల్ భయాకరాహవముల్ గలుమప్రచారముల్
గాసియొనర్చి భేదములగల్పనజేయునుగాని ప్రేమమై
భాసురలీలదేశిక శుభప్రదమై తనియింపగల్గునే?

# స్త్రీ జనోచితమగు విద్య

శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు

శరీరదార్ఢ్యమును బట్టియు, మానసిక ప్రవృత్తులను బట్టియు, సాంఘిక వ్యవస్థలను బట్టియు స్త్రీ పురుషుల విద్యావిధానము వేరుగా నుండవలెనను విషయము నెందరో సోదర సోదరీమణులు చర్చించి సారాంశమును దేల్చి యున్నారు.

స్త్రీలకును, పురుషులకును శరీర తత్త్వము వేరు వేరుగా నుండును. స్త్రీలు దుర్బల దేహులు. వీరు నీడనుండి యొంటైన పనిచేయగలరు. కాని యెండలలో కొండలలో తిరిగి పనిచేయలేరు. పురుషులు దృఢకాయులు. బైటగల పనులను చేయగలరు. వారి తత్త్వమునకా పని తగియుండును.

సంఘములో ప్రతి కుటుంబమును పరిశీలించినచో భార్యాపుత్రులకొరకై కష్టించి ధనార్జనచేసి వారల పోషించుట మగవారి పనియై యున్నది. గృహ నిర్వాహకత్వము, భర్తృసేవ మున్నగునవి స్త్రీల పనులు. ఇట్లు పూర్వమునుండియు వారివారి తత్త్వములను బట్టి ఆయా పనులు విధింపబడినవి.

ఒక్కరే అన్ని పనులను నేర్చుకొని, వానిలో ప్రతి దానిని మిక్కిలి నేర్పుతో చేయగల్గుట కష్టసాధ్యమైన విషయము. కొందరు కొంత పనిని మరి కొందరు కొంత పనిని తమ పనులను విభాగించినచో వారలకు నియమించిన పనులను సులువుగను తృప్తిగను చేయగలరు. ఇంటి పనుల విషయము చూతము. ప్రతి గృహమందున పాదికి పనులను చేయుటకు మనిషి తప్పక యుండును. అదిగాక వంట కొకరు, పైపని కొకరు యున్నచో వారిరువురు తమ పనిని సునాయాసముగ చేయుదురు. అట్లుకాక ఆ రెండు పనుల నొక్కరే చేసికొనినచో మిక్కిలి కష్టమును, ఆలస్యము నగును. అట్లే స్త్రీ పురుషులు నొకేమార్గము త్రొక్కి యొకే పనిని చేయుటకంటె స్త్రీలొక పనిని పురుషులొక పనిని తీసికొని దానియందు తమతమ నేర్పును జూపి, తాము సుఖించుట చాల నావశ్యకమైన విషయము.

పై సంగతులను బట్టి స్త్రీ పురుషులకు ప్రత్యేక విద్యావిధాన మవసరమని తెలుచున్నది. స్త్రీజనోచితమగు విద్యయందీ క్రింది విషయము లుండవచ్చును.

సంసారమునకు వలయు సామగ్రినిగొని దాని నష్టము చేయక వుపయోగించుకొనుట, పిల్లలను పెంచి వారికి క్రమశిక్ష నొసగుట, వారియారోగ్య విషయమును, దుస్తుల శుభ్రతను చూచుట, తమ బిడ్డల నాదర్శ స్త్రీలుగను, భావి పౌరులుగను, దేశోద్ధారకులుగను తయారు చేయుటయు, బాల్యమునుండియు వారికి శౌర్య ధైర్యంబులను, సౌశీల్యము సుగుణాలతో నేర్పవలెను. ఇల్లు మూచి యిల్లాలిని చూడవలెను. శుభ్రతలేక నానా అసహ్యముగనున్న యింటిని చూచినచో యిక యిల్లాలిని చూడ నవసరములేదు. ప్రతి స్త్రీయు గృహమును శుభ్రముగా, అందముగా సర్దుకొనుట నేర్చియుండవలెను.

ఆకస్మికముగా బిడ్డలకనేక ప్రమాదములు సంభవించును. ఒళ్లు కాల్చుకొనుట, పడుట, బెణుకుట మొదలగునవి జరుగుచుండును. పసితనమువలన తెలియక నేలప్రాకెడి పురుగులను తినుట, తారుండలు నాకుట, సబ్బులు కొరుకుట మొదలగునవి చేయుదురు. అట్టి సమయములందు తగిన చికిత్స చేయుట ప్రతి స్త్రీయు నేర్చియుండవలెను. కాన ప్రతి బాలికకును ప్రథమ చికిత్సాజ్ఞాన మవసరము.

పాశ్చాత్య దేశములలో స్త్రీలే గుమస్తాలుగనుండుటయు, టైపురైటింగు, షార్టుహాండు, టెలిగ్రాఫ్, టెలిఫోను పనులను వారే చేయుచుండుటయు, పోస్టాఫీసునందు రిజిస్టర్లు చేయుట మనీయార్డర్లు పుచ్చుకొనుట వారేయనియు మనము వినుచున్నాము. ఆఫీసు కంతటికి యొక అధికారి (పురుషుని) నుంచి మిగిలిన పనులనన్నింటిని స్త్రీలే నిర్వహించుచుందురు. ఇవి నీడనుండి చేయగల పనులు. పురుషుల పనులను స్త్రీలే చేసినచో పురుషులగతి యేమని ప్రశ్న రాగలదు. వారు తమ దేహశక్త్యనుసారము పరిపడు పనులను చేయవచ్చును. దొరతనమువారి స్త్రీల పాఠశాల, కళాశాలలయందు మగవారిని గుమస్తాలుగ నియమించుచున్నారు. ఆపని స్త్రీలు నిర్వర్తించినచో బాగుండును. నాగరికతాభివృద్ధిలోని నిమ్నోన్నతము లించుమించుగా తెలిసికొనవలెను. సామాన్యముగా రూపాయలలో కూడిక, తీసివేత, గుణకార భాగహారములు తెలిసియుండవలెను.

మన రాజకీయభాష ఆంగ్లము, మాతృభాష తెలుగు, మతగ్రంథములు సంస్కృతము. కాన మనకా భాషాత్రయము అవసరము. మాతృభాష యన మాట్లాడుటయే కాదు. తెలుగునను మహా కవీశ్వరులు, పండితులు రచించిన గ్రంథరాజములు గలవు. వానినెల్ల చదివి, యానందించగల సామర్థ్యము కలుగవలెను. కాళిదాసత్రయమైన చదివి అర్థము చేసుకొనగలిగిన సంస్కృత జ్ఞానముండవలెను. మత గ్రంథములను, పురాణేతిహాసములను చదివి సామాన్యాధ్యాత్మిక విషయముల నన్నింటిని తెలిసికొనుటకు సామర్థ్యులై యుండవలెను.

స్త్రీలు కోమలగాత్రలు. వారి గాత్రమున సహజ మాధుర్యముండును. సంగీతజ్ఞానము లేకున్నను వారి పాట వినుటకెంతయో శ్రావ్యముగ నుండును. అట్టి స్త్రీ గాత్రమునకు సంగీత శాస్త్రజ్ఞానము గలిగినచో బంగరునకు తావియబ్బినట్లు యతిశయోక్తి కానేరదు. ఆ గృహిణి బిడ్డలకు బాల్యమునుండియు సంగీత జ్ఞాన మలవడును. ఆనంద దాయకమగు నీ సంగీతము ప్రతి స్త్రీకిని యవసరము.

ప్రతి కుటుంబమునందు స్త్రీల రవికలు జాకట్లు బాలికల పరికిణీలు, గౌనులు, మగ బిడ్డలకు ఆఫారములు, లాగులు, మగవారి కోటులు, బనీన్లు, ఆఫారములకు, కుట్టుకూలి సెంత దర్జీవానికి పోసికొనుచుంటిమో అంద రెరిగిన విషయమే. మన చేతగల పనులను విడుచుటయే గాక ధనవ్యయ మెందర్పట మిగుల శోచనీయమగు విషయము. కాబట్టి ప్రతి స్త్రీయు కుట్టుపని బాగుగా నేర్చియుండు టావశ్యకము. కుట్టుపని వలన వలయువారు ధనము గడింపవచ్చును.

ప్రతి యింటియందును పేము తొట్టెలు, కుర్చీలు యుండు టావశ్యకము వానిని మనమే చేసుకొనినచో పేమునకగు ఖర్చుతప్ప మిగిలిన కూలి, లాభం మనకు లాభము గాదా? పూసల పళ్లెములు, గాజు పూసల పనులు, లేసుపనులు నేర్చినచో గృహాలంకారమునకు పనికివచ్చును. వీని నమ్మినచో మంచి విలువరాగలదు. ఈ పనులవలన యింటికి వలయునవి తయారు చేసికొనుటయే కాక, ధనముగూడ గడింపవచ్చును.

రాట్నముతో నూలువడికి తమయందరి బట్టలను చేయించవచ్చును. దీనివలన కూలిలేక యల్లాడువారికి పనికల్పించిన వారమగుదుము. దీనిని ప్రతి స్త్రీయు నేర్చి స్వదేశాభిమానముతో ఖద్దరు గట్టు కుతూహలురై యుండవలెను.

వంటపనిని ప్రతి గృహిణియు, బాలికయు ముఖ్యముగ నేర్వవలసిన విషయము. వస్తువులను తెచ్చి పడవేయుట మగవారి పనియైయున్నది. ఆ వస్తువులను చక్కగా, శుచిగా, రుచిగా చేసిపెట్టుట ఆడువారి పని. భార్యా బిడ్డల సుఖమునుగోరి అష్టకష్టముల ననుభ

వించి ధనమార్జించి, తన సర్వస్వమును తమకు ధార వోయు భర్తకు, అథము శుభము తెలియని బిడ్డలకు జిహ్వాకు హితవుగ చేసిపెట్టుట ప్రతి స్త్రీకిని విధియై యున్నది. ఐశ్వర్యవంతులు, పెద్ద కుటుంబీకులు వంటవారిని పెట్టుకొనినచో వారికా సొమ్ము లెక్కయుండదు. కాని సామాన్య కుటుంబీకుల కనవసరము. వంటవారు 10 రూ. అయినను జీత మిచ్చిన గాని దొరకరు. వారి భోజనమునకు 10 రూ. ఖర్చు. మొత్తం వానిక్రింద ఖర్చు 20 రూ. ఈ 20 రూపాయలతో చిన్న బీద కుటుంబము జీవించవచ్చును. ఇంత సొమ్మును ఖర్చుచేసినను మనచేతులతో వొండిన తృప్తి కలుగదు. వారు వడ్డనచేయుట విధియనుకొందురేగాని, వారి హృదయమున మనపై మన వారిపై ఆదరణ శూన్యమనుట నిర్వివాదాంశము. వంటవారొకప్పుడు రానిచో సంపన్నుల గృహిణులైనను వండక తప్పదు. కాబట్టి ప్రతి స్త్రీయు వంటచేయుటను నేర్చియుండవలెను. వంటచేయుట నీచమగు పని యని కొందరి యభిప్రాయము.

వండనలయదు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
అతిథులే తేర నడికిరేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ.

(మనుచరిత్ర)

మనచేతులతో మనము వండి పతికి, బిడ్డలకు పెట్టుట మంచిపని. ప్రవరునిభార్య రాత్రింబవళ్లు వంట చేసి అతిథులకు పెట్టుచుండెడిది. ఆమె పేరు భూమిపైని నిలచినది. కాబట్టి వంట చేయుట నీచము కాకపోవుటయే గాక మిక్కిలి గొప్పవిషయము.

బాలబాలికలకు అయిదుతరగతుల వరకు స్త్రీలే ఉపాధ్యాయినులుగ నుండుట యెంతయు నావశ్యకము. ఒకటి రెండు తరగతులవారు పెట్టెడి తిప్పలు, వేసెడి ప్రశ్నలు, చేసెడి యల్లరి పురుషులకు విసువుగ నుండును. పురుషులెల్లరు విసుగుదల వారని నా యభిప్రాయము గాదు. పిల్లల యల్లరి యొంకటి యోర్పు గలవారికైన విసిగించునంతటిదిగా నుండును. వారి యల్లరులను సహించుటలో, వారికి జ్ఞానము గలిగించుటలో స్త్రీ మిక్కిలి నేర్పును, యోర్మి నిజూపి వారిని లాలించి, బుజ్జగించును. ప్రతి స్త్రీ గృహిణి యగుటయు, కన్నబిడ్డలను క్రమశిక్షలో పెట్టుటయు తప్పదు. అట్టి స్త్రీకి బాల్యమునుండియు మాతృహృదయమే యుండును. మనహిందూదేశమున ప్రతి ఆడుబిడ్డయు బాల్యమునందు ఆటలలో తాను గృహిణిగ నుండి చందనపు బొమ్మను తనబిడ్డగ జేసికొని దానికి తల యంటి నీళ్లుబోసి, లాలించి పాటల పాడును. ఆ పనులను వారి కెవ్వరు నేర్పిరి? అది ప్రతిస్త్రీకిని, బాల్యమునుండియు వచ్చును. కావున స్త్రీలు పాఠములను ప్రేమతో మాతృహృదయముతో చెప్ప గలరు. లాలనగా చెప్పుటలో వీరి కెంత శక్తికలదో ఆ బిడ్డలలో గ్రహించుట కంత శక్తికలదు; కావున బాలబాలికల యెలిమెంటరీ పాఠములను స్త్రీలే బోధించుట మిక్కిలి యవసరము.

స్త్రీ పురుషులు కలిసి గాని యే పనినైనను సాధించలేరు. ప్రతికుటుంబమును పరిశీలించినచో స్త్రీ పురుషుల యైకమత్యమువలననే ఆ సంసారము గడచుచున్నది. అందులకే మనవారు స్త్రీ పురుషులు రథాంగములవంటివారనినారు. ఆ రథాంగములలో నేది లేకున్నను రథము నడువదు. సంసారమను నావకు స్త్రీ చుక్కాని వంటిది. నౌకా దీపగృహము (Light House)ను బట్టి యోడ దానిమార్గము గుర్తించినట్లు స్త్రీని బట్టియే సంసారము మంచిమార్గమున నడచును. ప్రతిమనుష్యుని కనునది స్త్రీ. పెంచునది స్త్రీ. బుద్ధులను కరపునది స్త్రీ. మరల పురుషుని ప్రేమించి, సుఖాబ్ధి నోలలాడించునది స్త్రీ. స్త్రీ మాతయై భార్యయై పురుషుల కేలోటును రాకుండ జేయుచున్నది.

ప్రతిస్త్రీయు నింతవరకే చదువవలెనని నా యిచ్ఛ కాదు. మగవారిలో మాత్రమందరు పట్టభద్రులు కలరా? మెట్రిక్యులేషన్ వరకు గాని ఆ లోపుగా గాని డబ్బులేకనో, అనారోగ్యమువలననో మరి యే కారణముననో విద్యకు స్వస్తి చెప్పువారు లేరా? అట్లే వీలగు స్త్రీలు పట్టపరీక్షల కేగవచ్చును. పాఠశాలలో బాలికలు మూడునాలుగుఫారములు చదువుచు పెండ్లి యయినదని కొందరు, కాపురమున కేగి కొందరు మొత్తమువీద సగముమంది విద్య మాను కొనుచున్నారు. అంతవరకా చదువుకైన సొమ్ము నష్టమగుటయే కాక, వుపయోగకరముగు విద్యగాక పోవుటచే వారు క్రమక్రమముగ మరచిపోవుచున్నారు. అందుచే పాఠశాలలో 1,2,3,4,5,6 ఫారములకు పై చెప్పబడిన విద్యలను నేర్పినచో ఆ బాలికలు పెట్టిన సొమ్ము, చదివిన చదువు బాలిక కుపకరించును. దాన వారు ఆదర్శగృహిణులై, వుత్తమమాతలై దేశాభ్యుదయమునకు కారకులౌదురు. కాబట్టి యీ విషయమున స్త్రీ పురుషులెల్లరు శ్రద్ధతో పనిచేయుదురని విశ్వసించుచుంటిని.

## మఱపురాని మాత

శ్రీ తవ్వా వీరభద్రరావుగారు

సీ. పాలుపారఁగా బోరగిలి పాన్పుపైనుండ, నవ్వింప కిలకిల నవ్వనాఁడు
ప్రాకుచు గుమ్మముల్ దూకుచునుండంగ, లీలతో నెత్తి లాలించునాఁడు
చెల్వారతనయంక సీమనిచి బుజ్జ, గించి మాటలు వలికించునాఁడు
కులుకుచు తప్పడుగులు వెట్టుచుండరా, వేకున్న గంతులు వేయునాఁడు
గీ. ఎఱుఁగనైతిని నాతల్లి యేమిసేతు, హాయిగా మముఁగూడి యున్నదియు లేదు
కర్మగతి తప్ప వేఱొండు గతియులేక, అమ్మరో మముబాసితే మమ్మ నీవు!
సీ. అన్నదమ్ములఁగూడి యాటలాడుచు నుండ, నూటిగా నావైపె చూచుచుండు
ఒంటిగా నెటకేని దంటిగా నేనేఁగ వేగ నారాకకై వేచియుండు
వచ్చిన వెంటనే వలదన్న మానక, కుడువబెట్టుచునుండు కూర్మిగలిగి
బడినుండి వేవేగఁ బరుగిడి నేరాగ, గారాబమున నన్ను గాంచుచుండు
గీ. అట్టిదైనట్టి మాయమ్మ యట్టెనిలిచి, వేయికన్నుల ననుగను పెట్టుచుండు
లోటు నాకెట్లు గలుగు నీ లోకమందు, అంచుడెందాన తలఁచి నానంతెగాని
ఎఱుఁగనైతిని విధిమాయ యెంత యాయె!
సీ. ఒకనాఁడు ననుజేరి యొజ్జలేరీతినఁ, బఠియింపకేసిరో ప్రశ్నలడుగు
ఒకఁనాడు ననుబిల్చి యొయ్యన నాయమ, నీతులనన్నియు నెమ్మి చెప్పు
ఒకఁనాడు ననుజేరి యొలికించుచుండును, పలుకుల నమృతంబు వదాచునుండ
ఒకనాఁడు ననుజూచి యూరకయాయమ, మురియుచుండును గదా ముత్యమట్లు
గీ. అట్టి మాయమ్మ నను బాసి యరుగగానె, గగనపథమున భవనముల్ గట్టినట్లు
వాయుపథమున నెగురంగ వలచినట్లు, నాదు కోరికలన్నియు నాశమాయె.

# • సంఘ దురాచారం! •

అంగర వెంకటకృష్ణారావుగారు

"అన్నయ్యా! రావూ? మనమిద్దరం బొమ్మలు పెట్టుకొని ఆడుకుందాం? ఇవాళ అమ్మని అడిగి ఎక్కువగా పప్పు అవీ తెచ్చా, రావూ? రావుకదూ...పోనీలే!" అని అతిదీనంగా అడుగుతూవచ్చేది మా రాజు. అసలు రాజుకీ మాకూ ఏటూ బంధుత్వం లేనేలేదు. చిన్నప్పటినుంచీ ఒకయింట్లో ఉండడంచేతా, ఆన్నేహాతిశయంచేతా నన్ను 'అన్నయ్యా' అని అతి ముద్దుగా పిలిచేది, పిలుస్తున్నాదికూడాను. రాజు నా కంటె కొన్ని సంవత్సరాలు చిన్న, రెండో ఒకటో. మేమిద్దరం ఎన్నడూ ఒకర్ని విడిచి ఒకరం ఉండలేకపోయేవాళ్లము. సాధారణంగా వాళ్లింట్లోనేనో, మాయింట్లో రాజమ్మో భోజనం చెయ్యడంకూడా సంభవించేది. మొత్తానికి మాయిద్దరి హృదయాల్నీ, స్నేహమనే బలవత్తరమైన తీగకలిపి కట్టివేసింది... అది సోదరసోదరీ ప్రేమ.

రాజు రాజవదన. మేమిద్దరంకలిసి ఆడుకొనే రోజులలో, రాజు ముఖముమీద సర్వదా చిరునవ్వు తాండవించేది. సంస్కారంలేకపోయినప్పటికీ ఆమె ముంగురులు విశాల ఫాలభాగంమీద నవీనకాంతులీనుతూంటే 'మత్తపుష్పంధయవేణి' అన్న ప్రయోగం స్ఫురించేది. నవ్విందంటే, పాల బిళ్ళలలాంటి చెక్కిళ్లు చిరుగుంటలుపడేవి. ఆమె పెదవులు సన్నని పండుదొండలా రక్తిమతో ఉండేవి. ఆమె మాటలాడిందంటే, నోటిలోంచి జారేవి మాటలో ముత్యాలో తెలిసేదికాదు. ఆమె పలువరుసతీర్చి దిద్దిన ముత్యాల ముగ్గుమల్లే ఉండేది. ఆమె మృదు కరనఖములు గోరింట లేకుండానే నవ్యరుచి మాల వెదజల్లేవి. మా యింటికొచ్చి గోరు కొనలతో మల్లెలు కోస్తూంటే మల్లెలకాంతి గోళ్లలో జిగేలు మనేది. నేను అప్పుడు చాలాచిన్నవాడినే అయినప్పటికీ రాజుని చూడగానే చేష్టలు దక్కేవాడిని. మా చావిట్లో ఆడుకుంటూంటే ఒకదగ్గిర సావకాశంగా కూచొని రాజమ్మ ప్రతీచర్యా కనిపెట్టి అందులో విశేషం అనుభవించాలనిపించేది. ఆమె ఆడిన ప్రతీమాటా ఆమె పాడిన ప్రతీపాటా కర్ణపర్వంగా వింటూ దానితీపి మత్తెక్కిపోయేటట్టు తిని వెయ్యాలనిపించేది.

ఆమాట తెలియగానే రాజు అంత తరుచుగా రావడం మానేసింది. ఆమెకి సిగ్గుగాబోసు. కాని అది సహజమే. స్త్రీజాతికి వంశపారంపర్యావచ్చే ఆస్తియేమిటి అంటే 'సిగ్గు'అని ఘంటాపథంగా చెప్పవచ్చును. ఎప్పుడైనా ప్రమాదవశాత్తూ కంటపడితే బలవంతాన్న ఆపి మాట్లాడించేవాడిని; 'రాజూ! నావేపుచూస్తావా! అప్పుడే బుద్ధి

యావత్తూ అటు తిరిగిపోయింది కామోసు! ఎంతయినా మనం...' అనే సరికల్లా చటాలున నామాటికి అడ్డొచ్చి, చిరుసిగ్గుతో 'లేదన్నయ్యా! నిన్ను ఈజన్మలో మరచిపోతానా? అది నాశక్యమా? ఒస్తా ఉండు...' అని నెమ్మదిగా సాగిపోయేది. ఆ బాల్యప్రవర్ధమాన సౌహార్ద్ర పటిమ అలాంటిదని నాకు బోధపడ్డది. అప్పుడు మా రాజమ్మకి పెళ్లి తలపెట్టేరు. అది నాకు ఒకందుకు విచారకరం, ఒకందుకు సంతోషకరం అయింది. సరి ఇక పెళ్లయిన తరవాత అత్తవారింటికి వెళుతుంది—అదృశ్యం అవుతుంది అని తోచింది. అప్పటికేదో పెద్దక్లాసే చదువుతూండే వాడిని మరి. రాజు అత్తవారింటికిపోతే నాకో పెద్ద నష్టం కలిగిందన్న మాట! కాకపోతే మరేమిటి—మాయిద్దరి హృదయాలనీ కలిపి కడుతూన్న స్నేహలత పటక్కున తెగిపోతుందన్న మాట. నాహృదయం బద్దలైపోయినట్టు కాదూమరి. సోదర సోదరీప్రేమ అనిర్వచ నీయమయినది. అనుభవం మీద, ప్రకృతి దగ్గర నేర్చుకోవలసిన పాఠమేగాని, అది నేటి ఈ అధ్యాపకు లెవ్వరూ చెప్ప లేరు. మాది, సోదర సోదరీప్రేమ కలీతమైన, కామేతరమైన, దుర్వాంఛా దూరమైన, మరియొక ఉత్కృష్ట ప్రేమ ఏదైనా ఉంటే అదే.

'రాజూ! రాజూ! వెళ్లిపోతున్నావా? రాజమ్మా! ఒక్క మాట. ఉండుండు. రైలొక్కసారి ఆపండి. మా రాజమ్మతో మాట్లాడవలసిన పనుంది. రైలాపరూ' అంటూ ప్లాటుఫారంమీద పరుగెత్తా. 'ఠక్' మని గోడతగిలింది బుఱ్ఱకి. తెలివొచ్చింది. అది కల—రాజు అత్తవారింటికెళ్లిపోతూన్నట్టు వచ్చింది. ఎంచేతంటే ఆ ఉదయాన్నే రాజమ్మ వెళ్లిపోయింది అత్తింటికి. మేమందరం ప్లాటుఫారం వరకూ వెళ్లాం కూడానూ! అదేకల మళ్లీ. కాని రాజుతో నిజంగా మాట్లాడే లేదు. అలావుంది నా ఆదుర్దా. మరి రాజు రాదేమో. ఎందుకు రాదు. ఎప్పుడూ రాకుంటే పండుగకైనా రాదా? పండుగకైతే అతన్నికూడా చూడొచ్చు. రాజు పండుక్కి వస్తూండడం వెళుతూండడం రెండేళ్ళు జరిగేయి. ఏడాదికోసారి వస్తే యుగానికోసారి వచ్చినట్టుండేది. వచ్చినప్పుడల్లా నన్ను చూడందే పోలేదు. కాని యిది వరకులా కలిసి మాట్టాడటం లేదు. నాకూ మొహమాటమే! ......వచ్చింది. మళ్లీ మామూలుగానే వచ్చింది. కాని యీసారి తానొక్కర్తే రాలేదు. ఇక్కడనుండి వాళ్లమ్మా వాళ్లనాన్నా వెళ్తే వాళ్లతో కలిసి వచ్చింది. వచ్చిందికాని నాకు అగుపడ లేదు. చాలకాలం ఉండిపోయింది. మరి వెళ్లడం తలపుకూడా లేనట్టగుపిస్తున్నాది. నావిచార మేమిటంటే వచ్చిన తరువాత వొక్కసారైనా కంటపడలేదేమి అని. అసలు అత్తవారి ఊరునించి ఉత్తరమైనా రావటంలేదని మాయింట్లో అనుకోగా విన్నా. ఏమైనా చాలా సందేహంగానే ఉంది. ఈకులాసా కైదురాజుకి ఎందుకూ?

ప్రమాదవశమువనో, నా అదృష్టవశమువనో ఆవేళ రాజమ్మ నాకంటపడి మెరపుతీగలా మాయమైంది. కాని ఆఒక్క లిప్తలోనూ రాజులో ఎంతోమార్పు అగుపడింది. జబ్బు మనిషిలావుంది. అంతకంటే మరేం గ్రహించ డానికి వేళయెంతగనక! కొంపదీసి రాజమ్మ జీవితం విషాదాంతం కాలేదుగద!

మరికొంతకాలం పోయాక వా సవం అయిన సంగతి తెలిసింది. ఇసకతోటీ, రాళ్లతోటీ రప్పలతోటీ ఒకపెద్ద పరాగం రేగిందిట. ఆ ఝంఝామారుతం ధాటికి ఆగ లేక, చక్కగా చిగిర్చి పెద్దరసాల పాదపం కూకటివేళ్లతో సహా పడిపోయిందిట. నిరా ధారనిరంజనం అవడంచేత, అది మరి లేవ లేక పడిన స్థలంలోనే, కుములుతూ కుళ్లు తూ ఉండిపోయిందిట. అదిలేచి బాగుపడం కల్లోనివార్తట. అప్పుడు హృదయంలో సముద్రాలు కలతపెట్టేయి. ద్వాదశాది త్యులు పుట్టి హృదయం దగ్ధం చేస్తూన్నారా అనిపించింది. నాకు వర్ణనాతీతమైన, అవ్యక్త మైన బాధపట్టుకుంది. కాని ఒక్కొక్క ప్పుడు నాకు నవ్వువచ్చేది. ఎందుకో? కాని, నాదుఃఖం కాలమానస్థితిలో తగ్గుతూ వచ్చింది. కొంతకాలానికి అదృశ్యం అవు తుందేమో! అది ప్రకృతి తంత్రం. ఇంతకీ దైవేచ్ఛ అలా వున్నప్పుడు మానవమాత్రు లం ఏం చెయ్యగలం? కాని చెయ్యగలిసిన దొక్కటి ఉంది. ఒకవ్యక్తి బాధపడుతూ న్నప్పుడు, అవ్యక్తికి దైవసహాయంలేనప్పుడు, మానవుడన్నవాడైన ఓదార్చాలి, కొంత లోకొంత. మానవుడు సాధ్యమైనంతవరకూ ఆవ్యక్తికి బాధ తగ్గించడానికి ప్రయత్నిస్తే చాలు. అదే పదివేలు. అపాటి సహాయం మనసంఘం చెయ్యదా అనుకున్నా. సంఘం అంటే మనలాటి మానవసమితి కదా! మానవత్వంలేకుండా ఉంటుందా? అను కున్నా. ఒకవేళ అలా లేక, 'Adding insult to injury' అన్న ఫక్కీలో ఉంటే అది రాక్షసం. సంఘం ఏమంత వెఱ్ఱిదయితే కదూ!

ఆవేళ ఉదయాన్ని ఆరున్నరకి లేచి పెరట్లో పళ్లు తోముకుంటన్నా. పెరటిసందు లోంచి ఎవరో రాబోయి చప్పున వెళ్లిపోయి నట్టయింది. 'ఎవరు?' అని రెండుసార్లు అన్నా. కాని బదులులేదు. లేవబోతూంటే మా అమ్మ వెళ్లి చూసి 'నువ్వేనా? రా! రావచ్చు. కొత్తమొహాలు ఏమీలేవు', అంది. అప్పుడు ఓవ్యక్తి ప్రవేశించింది. పోల్చుకోలేకపోయా. బాగా చూస్తే తెలి సింది. నా కళ్లని నేను నమ్మలేకపోయా. ఆ నిర్భాగ్యపు వ్యక్తి రాజమ్మ. ఈ రాజమ్మతో నేనా నేను చిన్నప్పుడు ఎంతో కలివిడిగా ఆడుకొనేవాడిని! ఆ దివ్యమంగళ విగ్రహాన్ని ఎందుకింత భయంకరంగా, వికృతంగా తయారుచేశారు? చిత్రకారుడు రాసిన, విచిత్రచిత్రంమీద, సిరాబుడ్డి ఒంపేస్తే ఎలా ఉంటుంది! అయ్యో రాజమ్మా! దురదృష్ట వంతురాలా! ఎత్తుగాలేచిపడుతూ, వీచికలలా జలజలలాడే ఆమెకురులపై, నల్లత్రాచు వలె పిరుదలదాకా వ్రేలాడే ఆమెజడపై

పాపిష్ఠి సంఘాని కింత కక్ష ఎందుకూ? పూర్తిగా జుత్తుతీసి వేయబడ్డది. ఆమె ముఖ కమలం వికృతంగా తయారయింది. అందాల చందమామ రాజమ్మ ఇప్పుడెలా ఉందో. సంఘ సంస్కార కర్తలు ఇలాంటి దౌర్జన్యం మాన్పడానికి ప్రయత్నించకపోతే, వారి ఉద్యమం యావత్తూపోల్లు. పట్టుపరికిణీ కట్టుకొని, పట్టుజాకెట్టు తొడుక్కొని, జుట్టు బాగా దువ్వుకొని, ముఖచంద్రుడు వెన్నెల ఒలకపోస్తూంటే, వెండిపళ్ళెం పట్టుకొని, పువ్వులకోసం పెరట్లోకి వచ్చే రాజమ్మని చూసి మురిసిపోయిన కళ్ళు, తెల్లపంచ కట్టుకొని, జుట్టులేక, కూలిపోయిన హృదయంతో, దేహం కృశించి, పువ్వులకోసం వచ్చిన రాజమ్మని చూసి అశృపూరితాలయిపోయేయి. మొహం మీద పడుతూన్న మత్తపుష్పంధ మాలలాంటి ముంగురులు సవరించుకొనే లేత చేతులిప్పుడు ముసుకు సవరించుకుంటున్నాయి! .....ఇది చూచి సంఘం నవ్వుతోంది. ఇది దాని రాజ్యం—

ఆమె హృదయంలో పుట్టిన ఉజ్వల జ్వాలా మాలికలవేడి సంఘానికి తగలడం లేదూ? ఆమె వంటరిగా కార్చే కన్నీటి ప్రవాహంలో సంఘం, ఊపిరాడక, ఉక్కిరి బిక్కిరికావటం లేదూ!

# కర్షకా!

శ్రీ వి. వి. రామకృష్ణారావుగారు

గోవును పూర్వపుంజనులు గోమునపూజల సేయుచుంజనన్
నీవది త్రోసి రాజనుచు నీదగులాభమె కోరుచున్వనన్
ద్రోవను మార్చుచున్గరుణఁ దాల్పకదానిని బాధఁద్రోతువే
గోవది దానిఁగావనిచో నేగతులుండవు కర్షకా ధరన్.

పాపములన్నిటన్ బశువు బన్నముపాలును సేయుచుండుటే
తాపము కల్గఁజేయునుగదా భగవంతున కెల్లభంగులన్
కోపమువూనకే పశువు క్షేమమెగోరెడి వాఁడవైనచో
నాపని నీకు నెల్లవుకు నందగఁజేయును బెక్కుసౌఖ్యముల్.

గోవును నమ్మిరమె మనవారేవిధముగ ముక్తినొందిరో యారీతిన్
నీవును నర్మిలి జనినన్ దైవము నిన్ననవరతము దయఁబ్రోచుఁగదే
నోరెఱుఁగని పశువులఁగను కాటియ పెట్టంగనేమి కర్జంబయ్యా!
పెరుగును నీపాపంబది మఱిమఱి బాధలనుబడెదు ముందున నింగిన్.

మానులకుగూడ దుస్సాధ్య మగుచునుండు ముక్తినొక భర్తృసేవచేఁ బొందునతివ
యటులె నీకల్పమగునావు నాదరించి పరమపదమును బడయుమో పతితజీవ.

# గానకళ

శ్రీ గాలి పెంచల నరసింహారావుగారు
మ్యూజికల్ డైరెక్టర్

## హంసానంది - జంపెతాళము

53-వ మేళకర్తయగు "గమనశ్రమ"యందు జన్యము

ఆరోహణ : స రి గ మ ద ని స
అవరోహణ : ,, శు అం ప్ర చ కా,,

— షాడవ షాడవము —

వ్రేలికి రెండుఅక్షరముల చొప్పున ఘాతనుండి రెండు అక్షరములు వ్రోసి పాడుకొనవలయును. ఈ కీర్తన ఖండగతిగా వ్రాయబడినది. మిశ్రజాతి జంపెతాళము వేసి పాడుకొనినను అనుకూలము యుండును.

పల్లవి. పరమ బాంధవులనుచు - పరులదాస్యము సలిపి
పరమార్థమును మరచి - బ్రతుకుచుంటిని॥ పరమ॥

అనుపల్లవి. పరమాత్మ నన్ను నీ - దరిజేర్చుకొమ్మనుచు
పరిపరివిధంబులను - బ్రతిమాలుచుంటి గద॥ పరమ॥

చరణము. ధరపైని నీవె తలి - దండ్రిగురు దైవమని
దారిద్ర్యమును మరచి - ధ్యానింపుచుంటి గద
దారసుత బంధువులు - తనువునకె గాని నా
దారిజూపంగ నెర - దాతవని నమ్మితిని॥ పరమ॥

| | | | | |
|---|---|---|---|---|
| పల్లవి. | ,, ససా సాసా | । నీసానీదాదా | । ,, దనిదా మదమా | । గమగారీసాసా |
| | ,, పరమ బాం | । ధవులనుచు | । ,, పరుల దఅఅ | । స్యఅమూసలిపి |
| | ,, ససా నిసగరి | । సనిరిస నీదాదా | । ,, నిదదా నిమమా | । దమగమగారీసా |
| | ,, పరమా బఅఅఅం | । ధఅవుఉలనుచు | । ,, పరులదఅఅ | । స్యఅముఉసలిపి |
| | ,, పనిసా,,సా | । గాగామాదాదా | । ,, మదనీదామా | । మాగాగమదనిసా |
| | ,, పరమా,,ర్థ | । మును మరచి | । ,, బ్రతుకుచుం | । టిని రఅఅఅమా |

| | | | | |
|---|---|---|---|---|
| | ,, సని పానిపగా | గాగమదాగమదా | దామదనీదామా | గగమమదదనినిసా |
| | ,, పరమాఅఅర్థ | మునుఉ మరఅచీ | బ్రతుకుచుం | టిఇనిఇరఅఆఅరూ |
| అనుపల్లవి. | ,, గగమాదామా | దా ,, నీసా ,, | ,, సపసా ,, సా | సనిరిసనీదాదా |
| | ,, పరమాఆత్మ | వ ,, న్నునీ ,, | ,, దరిజే ,, ర్చు | కొఒఒఒమ్మనుచు |
| | ,, గమదమ దమదా | నినిదానీసా ,, | ,, సససారీసా | నిసరిస నిసనిదదా |
| | ,, పరమఆఆఆత్మ | వఅఅన్నునీ ,, | ,, దరిజేఏర్చు | కొఒఒఒమ్మఅనుఉచు |
| | ,, సనిసరిగ గా | గమదమ గారీసా | ,, సనిరిససాసా | నిసనిదమాగమదని |
| | ,, పరిపఅరీవి | ధంంబులను | ,, బ్రతిమఅఆలు | చుంంటిగఅదఅ |
| | ,, పనిసాసరిగా | గరిగమగరిసాసని | నిసనిదదనిదమమద | మగగమదమగమదని |
| | ,, పరిపరిఇవి | ధంంంబుఉలనుఉ | బ్రఅతిఇమఅఅఅలుఉ | చుంంంటిఇగఅదఅ |
| | (పరమబాంధవులనుచు) | | | |
| చరణము. | ,, గగగా,,గా | గమదమగారీగా | గమదనిదామాగా | గమదమగారీసా |
| | ధరపై,,ని | నిఇఇఇవెలి | దంంంద్రిగుచు | కైఇఇఇవమని |
| | ,, సాసా ,, సా | నిపనీదామాధా | ,, మదనీపాపా | గామాగారీసా |
| | దారీ,,ద్య | ముఉనుమరచి | ,, ద్యఅనింపు | చుంటిగద |
| | ,, గగమాదామా | గమదనిసాసాసా | ,, పసపా రీసా | పనిరిపనీదామా |
| | ధాఅరసుత | బంంంధువులు | ,, తనువునకై | గఅఅఅనియూ |
| | ,, గమదమ దమదా | నినిదమదనిసాసా | ,, సససా పగరిప | నిసరిప నిపనిదదా |
| | దఅరఅసుతఉత | బంంంధుఅవులు | ,, తనువునఅకైఏ | గఅఅఅనిఇనఅఅ |
| | ,, పనిసరిగాగా | గమదమగారీసా | పనిరిపసాసాసా | నిపనిదమా గమదని |
| | దఅరిఇజాఉ | పంంంగనెర | దఅఅఅలివని | నఅఅఅమ్మి తిఇనిఇ |
| | ,, సనిసరిగరిగా | గరిగమదమగరిపని | నిపనిదదఃదమమద | మగగమద గమదనిస |
| | దఅరిఇజాఉఉ | పంంంగఅనెఎరఅ | దఅఅఅలిఅవఅనిఇ | నఅఅఅమ్మి తిఇఇనిఇ |
| | (పరమబాంధవులనుచు) | | | |

ముక్తాయిస్వరము

| | | | |
|---|---|---|---|
| సాసనినిద మదనిస | నీదదమగ మనిదమ | గమగసాస నిస నిస | నిదనిసాసామాగ |
| , స నిసనీదామగ | మాసాగామదనిస | నిసగాగ రిగసరీ | రినిసనిదమదానిమదని |

# పుష్పచయము

## సతులకు సలహాలు

అస్తమానూ అదే పనిగా మాట్లాడుతూ వుండకూడదు. మీ పురుషులకు మీ మాటలు వినాలని కుతూహలం వుంటుంది. మీరు అస్తమానూ మాట్లాడితే పేలవమైపోయి అసహ్యం పుడుతుంది.

మీ భర్తలను మీరు గాఢంగా ప్రేమించాలి. కాని అంతగా ప్రేమిస్తూన్నట్టు పూర్తిగా తెలిసిపోకూడదు. కొంత బెట్టుకూడా వుండాలి.

మీ భర్తల కిష్టమైన పదార్థాలనే ఎప్పుడూ తయారుచేసి పెడుతూంటే, ప్రేమబంధం బాగా బిగుసుకుంటుంది.

మీ భర్తలయొక్క పురుష సంబంధమైన ప్రయివేటు విషయాలలో మీరు కలగజేసుకోగూడదు.

మీ భర్తలతో దెబ్బలాడేటప్పుడు ఆ దెబ్బలాటను పెరగనియ్యకండి. తర్వాత ఆవిషయాన్ని గురించి మరిచిపొండి.

మీ భర్త లేవైనా తప్పులుచేస్తే, నెమ్మదిమీద వానినిగురించి మందలించాలి; వారి మంచిగుణాలను పొగుడుతూను.

మీ భర్తలను యింటి పనిమనిషిగా చూడకండి; మిమ్ము లను సుఖపెట్టడానివచ్చాడు గాని, మీపని మనిషిగా రాలేదు గనుక.

అస్తమానూ మీగుడ్డలు, మీ నగలు, మీ జేషాన్నిగురించే చెప్పకండి మీ భర్తలతో; వాళ్ల జేమభావలనుగురించి కూడా సలహాలివ్వండి.

వారు ఏకాంతంగా వుండాలని యిచ్ఛగించుతూ యుంటారప్పుడప్పుడు. ఆలాంటి సమయాలు కనిపెట్టి వారిని సమీపించకండి.

## దెయ్యాలగ్రుడ్లు

ఈమధ్య లండనులో జార్జిడాసన్ రాలె అనే ఆయనయొక్క పక్షివిషయకశాస్త్ర సంబంధమైన లాబొరేటరీ అమ్మకానికొచ్చింది. దానిలో పెద్దపెద్దగ్రుడ్లు వున్నాయి. ఇప్పుడు ఆగ్రుడ్లు అందరికిని వినోదమైంది. ఆగ్రుడ్లు 'ఎపోర్నిస్' అనే పక్షిదట. ఆపక్షి మెడగాస్కర్ దేశంలో మూడునాల్గు వందల సంవత్సరాలక్రితం వుండని తేల్చారు. దాని ఎముకలనిబట్టి 15 మొదలు 20 అడుగులవరకు ఆపక్షి ఎత్తుంటుందని అనుకుంటున్నారు. ఆగ్రుడ్డు 1858 లో దొరికిందట దాని పొడుగు 13 అంగుళాలు, చుట్టుకొలత 9 అంగుళాలు. ఆదేశస్థులు వెనుక యీగ్రుడ్లని తెచ్చి రెండు చిప్పలక్రింద బద్దలుకొట్టి అన్నం వండుకొనే పాత్రల క్రింద తదితర పాత్రలక్రింద వాడుకొనేవారట. ఆగ్రుడ్డుకి ఒకప్రక్క చిల్లుపెట్టి, చిన్నరోదచేసే పక్షిగ్రుడ్లలు 60,000 దానిలో పోస్తే పడుతుందట. ఈ గ్రుడ్లలో ఒకదానిని 262 పౌన్లకి అమ్మారుట. ఇప్పుడా పక్షి

ఆ సమీపాల్లో కనపడటంలేదు. ఈపక్షి నెట్లయినా పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఆర్కిటిక్ సముద్రంలోకి చాలాదూరంపోతే దొరకవచ్చునంటున్నారు కొంతమంది. కాని ఆప్రదేశాలు నిత్యం మంచు కొండలతోటి, పొగమంచుతోటి నిండివుంటాయి. అందుచేత అక్కడికి వెళ్లడం యిప్పుడు వీలుండదని వూరుకున్నారు.

## కోరియా స్త్రీల ఘోషాపద్ధతి

కోరియాదేశపు స్త్రీల ఆచారాలు చాలావింతగా వుంటాయి. వీరు వీధులలో తిరగటాని రావలసి వస్తే ఆపాదమస్తకం ఒక పెద్ద కోటులాంటిది కప్పుకుని తిరుగుతారు. అంటే వారి శరీరం పురుషులకళ్ల కాస్తంతైనాపడగూడదన్నమాట. ఇది చాలాచాలా ప్రమాదాలకి కారణమైంది. ఇక యీ ప్రమాదాలు సహించలేక వాళ్లో ఏర్పాటుచేసుకున్నారు. ఆ ఏర్పాటుప్రకారం, పురుషులు వీధుల్లో తిరిగేటప్పుడు స్త్రీలు తిరగకూడదు. స్త్రీలు తిరిగేటప్పుడు పురుషులు బయటకు రాకూడదు. ఇల్లా ఏర్పాటుచేసుకోవడం మూలాన్ని వొకరి అడ్డంకి యింకొకరికి లేకుండా స్వేచ్ఛగా తిరగటానికి వీలయింది. ఆ ఏర్పాటేమిటంటే సాయంత్రం కాగానే ప్రతివూరిలోనూ ఓపెద్దగంట వాయిస్తారు. ఆశబ్దంవినగానే పురుషులు వాళ్లువాళ్లు చేస్తూన్న పనులన్ని కట్టేసి యిళ్లల్లోకొచ్చి కుక్కినపేనుల్లా కూర్చోవాలి. అంతట స్త్రీలు బయటకొస్తారు తిరగటానికి. మళ్లీ కొంతసేపయ్యాక, స్త్రీలు యిళ్లకు చేరుకునేసరికి వేరేయింకోగంట వినబడుంతుంది. అచప్పుడువిని గాని పురుషులు బయటకు రాకూడదు. ఆలా ఒకళ్ల వేళలో యింకొకళ్లు బయటకువచ్చారంటె కఠినశిక్షలు పడుతూండేవి. ఇంత కఠినంగావున్న వాళ్ల ఘోషాపద్ధతి యిటీవలిటీవల కొంచెంకొంచెం తగ్గుతూవస్తోంది. పైగా వీరికి భూతపిశాచాలంటే చాలాభయం కూడాను. ఆపేరుచెబితేచాలు గజగజవణికిపోతారు. అందుకుగాను వికృతంగా విగ్రహాలను తయారుచేసి ప్రతివూరి పొలిమేరల్లోనూ వుంచుతారు. దయ్యాలుభూతాలు యీ బొమ్మల్ని చూచి పారిపోతాయని వారి నమ్మకం.

## రకరకాల ఆకులురాల్చే చెట్టు

సిలోనులో వొ చెట్టు శాస్త్రవేత్తలందరికి చాలా పనిచెబుతోంది. ఆచెట్టు మామూలు మామిడిచెట్టంత వుంటుందట. అన్ని చెట్లల్లాగా కాకుండా, ఏడాదికి 4 సార్లు ఆకులన్నీ రాల్చేసి మళ్లీ చిగురుస్తుంది. చిగిర్చినప్పుడల్లా రకరకాల ఆకులు వేస్తుంటుంది. ఒకసారి వేసిన ఆకులు మళ్లీ రెండోసారి కనపడవు. ఇలా రెండు సంవత్సరాలనుంచి మారుతూ వస్తోంది. దానికాయ మనపెద్ద ఏపిల్ కాయకు రెండింతలు కాయ వుంటుంది. పెద్దపెద్ద శాస్త్రజ్ఞులు యీవింత ఏమిటో అని పరీక్షిస్తున్నారు.

## ఏనుగు గుమ్మడికాయ—పౌను బంగాళాదుంప

అమెరికా దేశంలో కార్డియల్ అనే ఒక వ్యవసాయదారు డున్నాడు. అతను బంగాళాదుంపలు పండిస్తుంటాడు. ఒకనాడు ఓ బంగాళాదుంపని తవ్వి యింటికి తీసుకువచ్చి తూస్తే 1 పౌను 11 ఔన్సులుందిట. అంటే ఒక్కదుంప ఓ సంసారానికి కూరకి సరిపోతుందన్న మాట. ఫ్లారిడాలోకూడా ఇలాంటిదే ఇంకోటి. గుమ్మడికాయ పాదుని వుండగానే విపరీతంగా పెరుగుతూ వచ్చింది రోజూ ఒక పౌను చొప్పున. అల్లా పెరిగి పెరిగి యిప్పటికి 107 పౌనులయింది. యింకా ఎంత పెరుగుతుందో !

## విడాకుల విపరీతం

హాలివుడ్‌లో విడాకులు విపరీతంగా జరిగిపోతున్నాయి. వివాహాలెల్లా జరుగుతున్నాయో, విడాకులు గూడా అల్లాగే జరిగిపోతున్నాయి. యీమధ్య హాలివుడ్ డాక్టరొకడు యీలా నిర్వచించాడు అక్కడి పరిస్థితుల్ని:—“ఇక్కడజరిగే ప్రతి 10 వివాహాల్లోనూ 8 విడాకులై పోతున్నాయి. యీ వివాహాలు విడాకులు చివరికి క్రీడావినోదం క్రింద మారిపోతోంది.—ప్రొద్దున్న చేసుకున్న వివాహం సాయంత్రందాకా వుంటుందో వుండదో చెప్పడ కష్టమైన పరిస్థితులుకూడా వస్తాయి యిక కొద్ది రోజుల్లో—ఇది కేవలం పశుతుల్యం—దీని నిరోధించేందుకు ఏదేనా క్రొత్తపంథా తొక్కాలి ప్రభుత్వం. లేకపోతే యిది యింకా నీచం అయిపోయి దేశ గౌరవం నాశనమౌతుంది...”

## స్వదేశీ తాలిబొట్లు జంధ్యాలు

హిందూమతానికి శిరోభూషణమైనది ‘ఆచారము.’ దీనిలో కాలానుగుణ్యంగా అనేక విషయాలలో అనేకమార్పులు జరిగాయి. కాని, ఏ విషయంలో ఎన్నిమార్పులు జరిగినా, పురుషులు యజ్ఞోపీతాల్ని, స్త్రీలు మంగళసూత్రాల్ని యింతవరకూ పరమపవిత్రమైనదిగా ఎంచుతూనే యున్నారు.—యీ పవిత్రతను కాపాడుకుండుటకు ఏ పనిచెయ్యడానికైనా వెనుదీయరు. కాని, మన నిత్య కృత్యాలలో వాడుకొనేది ప్రతిది విదేశ వస్తువే. వాటితోపాటు ఆ విదేశదోషం వీటికీ తగిలింది.—

మనజాతి ప్రత్యేకత, మనమత ప్రాముఖ్యత, మనదేశ పరిశ్రమల పురోభివృద్ధి, మన ఆశయాల అధిక్యత, మనం నిత్యం కోరుతూ, దానికై సర్వవిధములా పాటుపడుతూయున్న మనకు యీ మంగళసూత్రపుయొక్క దారం సీమదారం కాకపోతే వేరే గత్యంతరలేదా? ఇప్పుడు ప్రతిపట్టణంలోనూ, ప్రతిపల్లెలోనూ, యీ సీమ జంధ్యాలు, యీ సీమ తాలిబొట్లు విరివిగా అమ్ముడై పోతున్నాయి. అచ్చంగా మనప్రత్తితో దారం తీసి, మనం తయారుచేసినవి దొరకడమేలేదు. సీమనూలు తెచ్చి దానినే నాలుగైదు పేటలు వేసి, వేసి అమ్ముతూంటే, అదే మనం స్వచ్ఛమైన స్వదేశీదని మోసపోయి కొనుక్కొంటున్నాము. ఇది చాలా విచారమైన సంగతి. అందుకని, ఎవరికి కావలసినవివారు స్వంతంగా తయారుచెసుకోవడం నూటికి నూరుపాళ్లు మంచిది. కనక, ప్రతిగృహిణియూ, తన దినచర్యలో ఇదికూడా ఒకపరిశ్రమక్రింద ఎంచి, తయారుచేయడం మంచిది. ప్రతివారికి కావలసిన ఖద్దరును చాలామంది ఎవరింట్లో వారు తయారుచేసుకోవటం లేదా? అదారమె దీనికి కూడ వుపయోగించితే,చాలా సులభమౌతుంది; పవిత్రతా వుంటుంది.

ఇక లేనివాడు, ఖద్దరువలెనె, దీనినికూడా అఖిలభారత చరఖాసంఘంవారు గమనించి, చేపడితె, లోటుండదు.

యజ్ఞోపవీతాలు హిందువులలో కొన్ని వర్ణములవారే వాడతారు; కాని మంగళసూత్రం ధరించని సువాసినియే యుండదు. కాన కొన్నిలక్షల సంఖ్యల్లో యీ తాలిబొట్టు యజ్ఞోపవీతాలు తయారు కావాలి. ఖద్దరు వుత్పత్తిచేసే సంఘాలుగాని అఖిలభారత చరఖాసంఘంవారుగాని నమ్మకంగా విరివిగా వీటిని తయారు చేయిస్తే, చాలా చవుకగాకూడా కిడుతాయి. అందరికి అందుబాటులోనూ వుంటాయి. వారి యితరబట్టల రకాలతో వీటిని వూరూరా విరివిగా అతి సులభంగా ప్రచారంలోకి తీసుక రావచ్చు. అటు వారికి వ్యాపార ధర్మంగానూ వుంటుంది; ఇటు తాలిబొట్టు యజ్ఞోపవీతా లికి అపవిత్రదోషం పోకకుండా చేసిన వారౌతారు. కాన గమనింపగోరుచున్నాము.

# గ్రంథ సమీక్ష

## శాంతి నికేతనము (ప్రథమభాగము)

కర్తలు శ్రీ ఆకురాతి కృష్ణమూర్తి చలమయ్య గారలు. ప్రకాశకులు, ఆకురాతి చలమయ్య, సూపరింటెండెంటు, శాంతికుటీరము, పిఠాపురము, తూ. గో. వెల కేపరుబైండు 1-8-0, క్యాలికో బైండు 2 రు.

నేటి పవిత్రభారతఋషి శ్రీ రవీంద్రకవీంద్రులు వారి 'శాంతినికేతనాశ్రమము'లో ప్రతిబుధవారమునఁ ప్రార్థనామందిరమందుఁ గావించిన ధర్మప్రసంగములన్నియు 'శాంతినికేతన' మను నామముతోఁ గొన్ని సంపుటములుగాఁ బ్రచురింపఁబడియున్నవి' వానిలో కొన్నిటిని ఆకురాతిసోదరులు అనువదించి యీ పుస్తకముగా ప్రకటించినారు.

హిందూమతమును, ఆదర్శములను ఆధునికుల కర్థమయ్యేటట్టుగా వ్యాఖ్యానం చేయవలసిన అవసరమెంతో వుంది. ఈ మహర్షి గ్రంథము అట్టి వ్యాఖ్యానమే గాకుండా, మహోన్నతజ్ఞానము, ఆధ్యాత్మిక భావాలు ఆకర్షణీయంగా వున్నయి. జిజ్ఞాసులందరూ చదువదగిన పుస్తకమే.

## ప్రేమతపస్విని

కవి శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు, తలమర్ల, కొత్తచెరువు పోస్టు, అనంతపురమండలము. ప్రతి వెల 0-6-0.

ఇది చిన్న ఖండకావ్యము. 'పవిత్రప్రేమోపాసనమున జీవితముగడపు పల్లెపడతి ఏకాంతమును సంబోధించుచు స్వయగాథను జెప్పికొనుట' ఇందలి వృత్తాంతము. ఈ 'చెప్పికొనుట'లో దారి తెన్నూ లేదు. మొదట పల్లెపడతి ప్రకృతినిగని పూర్వము ప్రియునితోనున్నప్పటి విషయాలను తలచుకొని వియోగబాధననుభవిస్తూ ఒక చెట్టునీడను నిద్రపోతుంది. కలలో కాంతుడు కనపడి తన వియోగభరాన్ని వెల్లడిస్తాడు. ఆ పడతిని అతనికి 'యోగవియోగములు' సాధారణము అని వేదాంతం చెపుతుంది. దానితోనే తృప్తిపొందుతూవచ్చి చివరి రెండు పద్యాలలో మరీ వియోగబాధలో పడిపోతుంది.

ఒకచో కవి 'నిన్ను పూదీఁగవలెఁ సృజించి జగదీశ్వరుఁడే వసియించునేమొ నీలో గుణరాశి, కావ్యకళలో కవి తన్మయుఁడైన రీతిగన్' అన్నారు. కాని చివరి రెండు పద్యాలను పల్లెపడతిని అననీయకుండా తానే గర్భాలున తనసంగతిని అనివేసినట్టుంది. అందుచేతనే కవి హృదయతాపం కాపుపడతి వేదాంతానికి అతకలేదు.

కవిత్వం మాత్రం బాగుంది. భావాలు మనోహరంగా మార్దవంగా ఉన్నతంగా ఉన్నాయి. కథలో ప్రకృతి తాండవిస్తూవుంటుంది. కవి ప్రకృతి పరిశీలన బాగా చేయగలరు.

## హిందీ తెలుగు సులభబోధిని
(ప్రథమ భాగము)

కర్త శ్రీ వంకాయల శేషావతారము, హిందీ ప్రచారక్, ఉన్నవ, ప్రత్తిపాడు పోస్టు, గుంటూరు జిల్లా. ప్రతి ఒకటికి 4 అణాలు.

రచయిత అనుభవము నుపయోగించి దీన్ని రచించారు. స్వయంగా నేర్చుకొనువారికి ఉపకరిస్తుంది. వివరణాలన్నీ తెలుగులో సులభంగా బోధపడేటట్టు వ్రాశారు.

## హైందవ ధర్మపోలీలు

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు. ప్రకాశకులు: దేశోద్ధారక గ్రంథమాల, 2844, ఇమాంబా వీధి, సికింద్రాబాదు.



డాక్టరు ముల్పూరి రంగయ్యగారు
వారి ధర్మపత్ని శ్రీమతి ముల్పూరి చుక్కమ్మగారు

పశ్చిమగోదావరి జిల్లాబోర్డుకు శ్రీ రంగయ్య
గారిని అధ్యక్షులుగను శ్రీమతి చుక్కమ్మ
గారిని జిల్లాబోర్డు సభ్యురాలుగను కాంగ్రెసు
వారిచే ఎన్నుకోబడిరి.



భక్తి పారవశ్యం

హైందవధర్మపోలీలను పాత్యంతరముగల నిది కొందరి హైందవవీరుల గాథ. ఇందు గోరా, భల్లా సింగు, ఇందుమతి, సోమనాద్రి, గురుగోవింద్ మొదలగు 12 వీరచరితములు గలవు. చదువుచుండ రక్తము నడుకెత్తి వడలు పులకరింపచేయు వీరకథలు. హిందూ దేశమున వివిధ ప్రాంతములయందలి చరిత్రలనుండి సంగ్రహించి శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు బాల బాలికలకుకూడ నర్థమానట్లు లేటతెలుగున చక్కగా చిత్రించినారు. ఇట్టి గ్రంథమును ప్రథమపుష్పముగా ఆంధ్రమహాజనులకు సమర్పించిన శ్రీ దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రశంసార్హులు.

## ప్రాథమిక స్వత్వములు

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు. ప్రకాశకులు: దేశోద్ధారక గ్రంథమాల, 2844, ఇమాంబా వీధి, సికింద్రాబాదు. ఇది ఈ గ్రంథమాలవారి రెండవ ప్రచురణము.

వాక్‌స్వాతంత్ర్యం, రచనాస్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం, ఆత్మస్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం మొదలైన ప్రాథమికహక్కులు దేశదేశాలలో ప్రజలు ఎట్లు సంపాదించిరో బాగుగా వివరింపబడియున్న దీ గ్రంథములో. ప్రాథమిక స్వత్వములు లేని మానవజన్మ నిరర్థక మను భావ ముట్టిపడునట్లుగా వ్రాసిన శ్రీ సురవరపు ప్రతాపరెడ్డిగారు చాలా అభివందనీయులు.

దీనికి శ్రీ డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి ఉపోద్ఘాతము కొంత నూతనకాంతి నిచ్చినది.

ఇట్టి గ్రంథములను ప్రచురించి యీ గ్రంథమాలవారు సార్థకనాములగుదురని ఆశించుచున్నాము.

## వ్యభిచారం

కర్త: శ్రీ గజపతిరాయవర్మగారు తాడేపల్లిగూడెం. డెమ్మీసైజులో గ్లేజు కాగితంమీద చక్కగా ముద్రింపబడిన పుస్తకం.

దీనిలోని విషయములన్నియు వెనుక 'ప్రతివాసి' అనే పేరుతో గజపతిరాయవర్మగారు 'సరస్వతి' పత్రికలో వ్రాసినవే, తిరిగి పునర్ముద్రించినారు.

వివిధ దేశాలలో వ్యభిచారవృత్తి ఎట్లు జన్మించి వృద్ధిపొందినదో వివరించినారు. ఈ విషయాలన్నీ అనేక గ్రంథములనుండి చాలా ప్రయాసమీద సేకరించి వ్రాసినారు. అక్కడక్కడ భాషాసౌష్ఠవం లేక చాలా నగ్నముగా వ్రాసినారు. అసలు రచనా వస్తువే అటువంటిది.

జాతీయవిచ్ఛేదనము, సంఘ విధ్వంసము, ఆత్మగౌరవనాశనమునైన యిట్టి యీ పాడు వ్యభిచార వృత్తిని నిర్మూలించుటకు సోవియట్ రష్యా పద్ధతుల ననుసరిస్తే కొనసాగునేమో!

## నిర్మాణసమస్యలు

కర్త: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శిగారైన శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు.

ప్రకాశకులు: నవశక్తి కార్యాలయం, బెజవాడ. వెల ౦౪ అణా.

దీనిలో కాంగ్రెసు, కాంగ్రెసుసోషలిస్టుపార్టీల సంబంధమును గురించి వ్రాయుచూ బహిరంగసభలను, మహాసభలను ఏవిధముగా జరుపవలెనో ప్రజలలో నుత్సాహము కల్గించుటకై పూరేగింపులు మొదలైన వాటి నేవిధముగా నేర్పాటుచేయవలెనో, ప్రజానీకముతో కలసి ఏవిధముగా పనిచేయవలెనో, సభలలో నుపన్యసించవలసినరీతి, సమ్మెలు, కార్మికకర్షక పోరాటముల నెట్లు కావింపవలెనో, విద్యార్థియువజన స్త్రీ సంఘాల నెట్లు నెలకొల్పవలెనో చక్కగా విశదీకరించియున్నారు. నేడు జాతీయపోరాటములో పాల్గొనే ప్రతిజాతీయవాదియు దీనిని జదివి అనుసరించిన నిర్మాణం కార్యక్రమమేవిధముగా మాదెబ్బ తినక చక్కగా సాగుననుట యతిశయోక్తిగాదు.

## అపరాధి ఎవరు?

గ్రంథకర్త: శేతవరపు రామకృష్ణశాస్త్రిగారు కురుకూరి సుబ్బారావుగారిచే ప్రకటింపబడినది.

“విద్యాభ్యాసము మంచిదే. కాని విద్య నేర్పు పద్ధతులయందే దోషమున్నది. ఇప్పటి బాలికాపాఠశా

లలో చదువు విద్యార్థినులకు విద్యకన్న విలాసములు భాగుగా పట్టుచున్నవి. ఇందువలన తుదకు గృహకల్లోలము సంసారమును దిద్దుకొనజాలక పోవుట, జీవితము దుఃఖమయమై భారముగా గన్పట్టుటయే పరిణామదశగా గన్పట్టుచున్నది. ఇంతకన్న వేరు లాభము లేదు. ఈ యాధునిక శిక్షాప్రణాళిక వలన స్త్రీలకు హితమేమియును లేదు. ఏమైన కలిగిన నపకారమే' అను విషయమును దోధించుటకై 'శారద'యను నొక విద్యావతి జీవితము నుదాహరణముగా జూపి, చిగురుకు నామెచే బాలికలకు విద్యయే గాక ఆదర్శ భారతలలనామణులుగా తయారుచేయు పద్ధతులతో నొక సనాతన ధర్మబద్ధమైన విద్యాలయమును నిర్మింప చేసి నేటి భారతస్త్రీ కట్టివిద్య యావశ్యకమో నిరూపించు నవలయిది.

కథావస్తువు చక్కగా విమర్శింపబడినది. ప్రారంభించిన ఆఖరకు విడువబుద్ధి పుట్టదు. ప్రతివారును చదువవలసినది.

రాజ్యలక్ష్మి

గ్రంథకర్త: నందూరి శ్రీ బంగారయ్యగారు, రాజమండ్రి. వెల రు. 0-8-0.

నాటకరంగములందు 'స్త్రీలే స్త్రీపాత్రములను ధరింపవలెనా' అను సమస్యను పురస్కరించుకొని వ్రాయబడ్డ ఆగంకముల నాటకమిది.

ఈసమస్యను చర్చించుటకు కథనల్లి, ప్రస్తుత నాటకరంగస్థలములందున్న యవినీతిలోపములను ఎట్లు దిద్దుకొనవలెనో చూపియున్నారు.

"సంతానవతులగువరకు కులసతులు నాటకరంగము నలంకరించుటలో తప్పులేదని పతిపతులు నాయికానాయక పాత్రముల ధరించినచో ప్రమాదమున కవకాశము తక్కువని, కులసతులు నాటకరంగ మధిష్ఠించువరకు దానికి సద్గతిచేకూరదని, లోకమున గురుపీఠమునకందదగిన నాట్యరంగము కేవలము వినోదసాధనమగుచున్న"దని నిరూపించుచు నాటకమున ఆ మూలాంతము చర్చించినారు.

ఇందులోని బహిరంగసభలోని ముచ్చట్లు చాల వినోదముగానున్నవి. అంతర్నాటక మొక ప్రత్యేకత. ఆంధ్ర నటనటీమణులు యిట్టిదానిని ప్రదర్శించి సంఘోన్నతికి పాటుపడెదరని విశ్వసించుచున్నాము.

ఇట్టి పరమోత్కృష్టమైన సమస్యల సాధారము చేసుకొని శ్రీ నందూరి బంగారయ్యగారు యింకను పెక్కు నాటకములను రచించుదురుగాక.

# పత్రికాలోకం

## నవయుగ

ఇది విజయనగరంనుండి శ్రీ. పి. రామకృష్ణపరహంసగారి సంపాదకత్వాన వెల్వడుచున్న జాతీయ పక్షపత్రిక. మొదటిసంపుటి మొదటిసంచిక మా కార్యస్థానానికి చేరింది. పత్రిక చాలా ఆకర్షవంతంగా వుంది. "దేశంలో గల వివిధ ప్రజాహిత సంస్థలనూ, ఉద్యమాలనూ ఏకంచేసి కాంగ్రెసు యాజమాన్యం క్రిందకు తెచ్చి జాతీయపోరాటం ద్విగుణీకృతంగా నడపాలి." యీ ఆశయాన్ని జయప్రదంగా సాధించడానికి 'నవయుగ' పూనుకుంటుంది.—ఆంధ్రమహాశయులు దీని కన్నివిధాలా చేయూత నివ్వకోరుతాము. వెల అర్ధణా.

## వైజయంతి

ఇది శ్రీ కొల్లాపుర స్నేహలతా కవితా సంఘమునుండి వెలువడ్డ 5-వ వార్షికపత్రిక. సంపాదకురాలు శ్రీ చేబ్రోలు సరస్వతీదేవిగారు, నూజవీడు. ఇందు శ్రీ జటప్రోలు సంస్థానప్రజలు శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరి శ్రీ సురభి వెంకటరత్నమాంబగారి కిచ్చిన కృతజ్ఞతాభివందనపత్రిక, వారి సమాధానము, తదితర ప్రముఖుల వ్యాసాలు, పద్యాలు వున్నాయి.




## స్త్రీలు—హక్కులు

"లేనిపోనిహక్కుల సృష్టింపకుడు హక్కవవారమను భావమును పారద్రోలుడు మానవసేవచే నూతననాగరక ప్రపంచమును నిర్మింపుడు—" అని సుప్రసిద్ధ భారతనారీమణి శ్రీమతి సరోజనిదేవిగారు యీనెల 17-వ తేదిని శ్రీ జగ్గన్నపేట జమీందారిణీ వారిచే నొసంగబడిన అల్పాహారవిందు సందర్భమున మాట్లాడుచు, స్త్రీలోకమున కిచ్చిన సందేశము అమూల్యమైనది, గమనింపతగినది.

ఈ స్త్రీహక్కులనుగురించి చాలసారులు యీ 'గృహలక్ష్మి'ద్వారా ముచ్చటించియే యున్నాము. అసలు యీ 'హక్కులు'అను వానికి 'ఇట్టివి—ఇంతవరకు' అనునొక నిర్వచనము తెల్పుటయే కష్టము. దేశకాలవ్యవస్థలనుబట్టి స్త్రీ పురుషులకుండవలసిన హక్కులు వారివారికుండును. ప్రకృతి సహజముగ స్త్రీ పురుషులకు శరీరమానసిక సంబంధముగ నెట్లు భేదమున్నదో అట్లే వారి నడతలయందును, వారు నిర్వర్తించవలసిన విధులయందును భేదముండును. అందుకనుగుణ్యముగ వారి బాధ్యతలు హక్కులు నియమితములై యున్నవి. ఎవరివివారు నెరవేర్చునియెడల కాలక్రమము తలక్రిందులగును. దేహనిర్మాణమునుబట్టి పురుషులు కష్టపడి పని చేయవలసిన విధి వారిపై బడినది. ఆకష్టఫలితమును సన్మార్గమున నుపయోగించి నుద్ధరించుట స్త్రీ విధియైనది.

అసలు గృహమొక రాజ్యము. ఆరాజ్యమునకు పట్టమహిషి స్త్రీ. ఆ రాజ్యమునకు కావలసినవి సేకరించుట పురుషుని ధర్మమై యున్నది. ఆరాజకీయములందు ఎట్టి వడుదుడుకులును లేక శాంతయుతముగ సాగునట్లు చూచునది స్త్రీ. కష్టసుఖముల నెదుర్కొను చాతుర్యము, కలిమిలేముల ఆటుపోటులందు సహనత, బాలబాలికలకు క్రమశిక్షణనిచ్చు ప్రాథమిక విద్యాలయముగా నాగృహమును మార్చు ఓర్పు మొదలగు క్లిష్టసమస్యలకు నిలయమైనది గృహరాజ్యాంగవాతావరణము. ప్రకృతి సహజముగ నీయోర్పు చతురత మొదలుగాగల సద్గుణపుంజముల కాటపట్టయిన స్త్రీ నిర్వహించినట్టీ ధర్మములను పురుషుడు నెరవేర్పగలడా? ఇటులనే వివిధరీతుల వారివారి ధర్మములందును హక్కులందును భేదమున్నది. కాన, అర్థములేని నేటి పాశ్చాత్య పద్ధతులను వ్యామోహములను గ్రుడ్డిగా ననుసరించి అట్టి హక్కులు నేడు మనసంఘమునందు లేవని యాందోళనచేసిన యట్టిది సంఘ విధ్వంసనమేగాని, సంఘౌన్నత్య మొతమాత్రమును

కాజాలదు. ఉత్తమవిద్యలు చదువవచ్చును. పురుషుడు నేడాక్రమించుచున్న ప్రతి స్థానమును స్త్రీ యాక్రమించవచ్చును. అందులకు అడ్డుగాని, అందని మ్రాని పండుగాని నేటిభారతస్త్రీకి లేదు.

కాన, స్త్రీ పురుషులు ఎవరెవరికి ఎట్టి హక్కులు ఎంతెంతవరకు యవసరమో, అట్టివాటినే యుచితరీతిని గ్రహించుచు, సంకుచితభావములకు చోటివ్వక, తక్కువ వారమను భావమును పారద్రోలి, మానవ సేవయే మంగళకరమని యెంచి పాటుపడిన వారివారి స్థానములు, హక్కులు, ధర్మములు వాటియంతట యవియె ఏర్పడును. అప్పుడే వారు ఆదర్శస్త్రీలుగను పురుషులుగను సార్థకనాములగుదురు.

ఇట్టి యమూల్య సందేశము నొసగిన శ్రీ సరోజనీదేవిగార్కి నారీలోకమంతయు ఎంతయో కృతజ్ఞులై యుందురు. అనుభవజ్ఞురాలు, అకుంఠిత దేశసేవాదీక్షాపరాయణ, ఆదర్శభారతమహిళారత్నము, విద్యావతి, వృద్ధురాలు శ్రీ సరోజనీదేవి, దేశకాల పరిస్థితులను మనమునం దిడుకొని అనుభవముపై నొసగిన యీసందేశము అవశ్యాచరణీయము. ఈ యభిప్రాయములే మా 'గృహలక్ష్మి' పాఠకలోకమునకు చిరపరిచితురాలు, శారదలేఖల రచయిత్రిగారైన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఇదివర కెన్నియోసారులు వ్రాసి హెచ్చరించియున్నారు. ఇందలి యదార్థమును గ్రహించి స్త్రీ పురుషు లన్యోన్యులై పాటుపడి భావి భారత భాగ్యోదయమునకు కారణభూతులగుదురుగాక యని విశ్వసించుచున్నాము.

ప్రప్రథమ మండలాధ్యక్షురాలు

శ్రీమతి రామసుబ్బమ్మగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారిచే నియమింపబడి, కడపజిల్లాబోర్డుకు అధ్యక్షురాలుగా ఏకగ్రీవముగా నెన్నుకొనబడినారు. ఇట్టి స్థానమునలంకరించుటకు నీమెయే ప్రప్రథమాంధ్ర నారీరత్నము. ఆంధ్రదేశమున కిట్టి గౌరవము దక్కుట మనము గర్వింపదగిన విషయము. ఈసమయమున శ్రీమతి రామసుబ్బమ్మగారి నభినందించుచున్నాము.

ఈమె రాయలసీమ నాయకులగు, శ్రీ కె. కోటిరెడ్డిగారి ధర్మపత్ని. ఈమె కడప పురపాలక సంఘమునకు సభ్యురాలుగ గత 1931 సంవత్సరమున ఎన్నుకొనబడి, కడప జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకు ప్రెసిడెంటుగా 1931 నుండి మూడుసారు లెన్నుకొనబడి, నేటికిని యీరెండు పదవులను అతి సమర్థతతో నిర్వహించుచున్నారు. నిశ్చల కార్యదీక్ష, స్వార్థరహితమైన దేశసేవ, నిష్కల్మషమైన పరిపాలనాదక్షత మొదలగు సద్గుణపుంజములు మూర్తీభవించిన విదుషీమణి. రాజకీయ పరిజ్ఞానమేగాక, భారతనారీమణికుండవలసిన శిష్టగృహధర్మములు గలిగి పదిమంది పుత్ర పుత్రికాసంతానము గల మాతృమూర్తి.

అధ్యక్షురాలైన యీమె గ్రామపురోభివృద్ధి, స్త్రీజనోద్ధరణమునకును సర్వవిధముల పాటుబడుదురని విశ్వసించుచు పరమేశ్వరుడీమెకు ఆయురారోగ్యముల కలగజేయును గాక యని కోరుచున్నాము.

EDITED BY DR, K.N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

శ్లో. ఆముగ్ధ మర్ధనయనామ్బుజచుమ్బ్యమాన
హర్షాకులవ్రజవధూమధురాననేన్దోః
ఆరబ్ధవేణురవ మాదికిశోరమూర్తే
రావిర్భవన్తి మమ చేతసి కేఽపి భావాః.

మ. మురళీగానసుధాపయోనిధి మదిం - బొంగం దరంగావళు
ల్దరికిన్ మీఱె ననం గటీతటదుకూ - లంబుల్ వడిన్ జాఱ న
బ్బురపుంగొల్లమిటారినీటు లరమో - డ్పుంగన్నులం గాంచు బి
త్తరపున్ముద్దులగోపబాలకుని నో - దప్రౌఢి భావించెదన్.

—శ్రీ కృష్ణ కర్ణామృతము.